బాలానంద బొమ్మల

# రాబిన్ హుడ్ సాహస కథలు

ర చ న :

సింగంపల్లి అప్పారావు




నవరత్న బుక్ హౌస్

కారల్ మార్క్సు రోడ్, విజయవాడ-520002.

బాలానంద బొమ్మల రాబిన్‌హుడ్ సాహస కథలు
రచన :
సింగంపల్లి అప్పారావు

ప్రథమ ముద్రణ :
నవంబర్ 2000

ముఖచిత్రం :
రవి
లోపలి బొమ్మలు :
వి.యస్. ప్రకాష్


28-22-20, రహిమాన్ వీధి
అరండల్‌పేట, విజయవాడ-2
ఫోన్ : 432 813

ముద్రణ :
డి. బి. ప్రింటర్స్
విజయవాడ-2

వెల : రు. 25-00

## బాలసాహిత్యంలో - బంగారు మొలకలు

| | |
|---|---|
| బాలానంద బొమ్మల షిరిడీ సాయిబాబా | బొమ్మల మర్యాద రామన్న కథలు |
| " అరేబియన్ నైట్స్ అద్భుత కథలు (3 భాగాలు) | " అల్లావుద్దీన్ అద్భుత దీపం |
| | " ఆలీబాబా 40 దొంగలు |
| " షేక్స్పియర్ అద్భుత కథలు(3భాగాలు) | " అక్బర్ బీర్‌బల్ వినోద కథలు |
| " బైబిల్ కథలు (2 భాగాలు) | " బేతాళ కథలు |
| " సింద్‌బాద్ సాహస యాత్రలు | " తెనాలి రామకృష్ణ కథలు |
| " రాబిన్‌సన్ క్రూసో సాహస యాత్రలు | " పరమానందయ్య కథలు |
| " డాన్ క్విక్సోట్ సాహస యాత్రలు | " భట్టి-విక్రమాదిత్యుల కథలు(2భాగాలు) |
| " రాబిన్‌హుడ్ సాహస యాత్రలు | " అపూర్వ చింతామణి |
| " రెండు మహానగరాల కథ | " కాశీ రామేశ్వర మజిలీల కథలు |
| " డేవిడ్ కాపర్ ఫీల్డ్ | " గలివర్ సాహస యాత్రలు |
| " ఆలివర్ ట్విస్ట్ | " భగత్‌సింగ్ |
| " రాజు - పేద | " బి. ఆర్. అంబేద్కర్ |
| " ప్రపంచ అద్భుత కథలు | " సుభాష్‌చంద్రబోస్ |
| " పంచ తంత్రం (2 భాగాలు) | " అజాద్ చంద్రశేఖర్ |
| " రామాయణం | " రాజా రామమోహనరాయ్ |
| " భారతం | " మదర్ థెరిసా |
| " భాగవతం | " రవీంద్రనాథ్ ఠాగూర్ |
| " దశావతారాలు | " జయప్రకాష్ నారాయణ్ |
| " శ్రీకృష్ణలీలలు | " యోగి వేమన |
| " టిప్పుసుల్తాన్ | " పూజ్య బాపూజీ |
| " వీరపాండ్య కట్టబ్రహ్మన | " భగవతీచరణ్ |

# విద్యార్థినీ విద్యార్థులకు అమూల్య నేస్తాలు

ఇంగ్లీష్-తెలుగు డిక్షనరి
తెలుగు-ఇంగ్లీష్ డిక్షనరి
హిందీ-తెలుగు డిక్షనరి
తెలుగు నిఘంటువు
త్రిభాషా డిక్షనరి
తెలుగు-హిందీ డిక్షనరి
ఇంగ్లీష్-ఇంగ్లీష్ డిక్షనరి
ఇంగ్లీష్-హిందీ డిక్షనరి
హిందీ-ఇంగ్లీష్ డిక్షనరి
రసాయన శాస్త్ర నిఘంటువు
జంతుశాస్త్ర నిఘంటువు
వృక్షశాస్త్ర నిఘంటువు
గణితశాస్త్ర నిఘంటువు
భౌతికశాస్త్ర నిఘంటువు
ఇంగ్లీష్ వ్యాసాలు-లేఖలు
హిందీ వ్యాసాలు-లేఖలు
తెలుగు వ్యాసాలు-లేఖలు
ఇంగ్లీష్ గ్రామర్
హిందీ గ్రామర్ (హైస్కూల్)
హిందీ గ్రామర్ (డిగ్రీ)
లాఫ్లీ జోక్స్
త్రిభాషా వ్యాకరణం
ఎంకిపాటలు
హితవాహిని
తెలుగు వ్యాకరణము
సులభ వ్యాకరణము
45 రోజుల్లో ఇంగ్లీష్
45 రోజుల్లో హిందీ
ఇంగ్లీష్ తెలుగు స్వబోధిని
హిందీ తెలుగు స్వబోధిని
గణిత ఒలింపియాడ్ (తెలుగు)
గణిత ఒలింపియాడ్ (ఇంగ్లీష్)
గణిత సూత్రములు
గణితము-సమస్యలు-సాధనలు
ప్రాథమిక గణిత శాస్త్ర స్వబోధిని
అంక గణితం
గణితశాస్త్రం (బీజగణితం)
స్మాల్ స్కేల్ ఇండస్ట్రీస్
ఫోటోగ్రఫీ నేర్చుకుందాం
తెలుగు సామెతలు
ఇంగ్లీష్ తెలుగు సామెతలు
మీ ఆంగ్ల పదజాలం పెంపొందించుకోండి
జోక్స్ వరల్డ్
1001 జోక్స్-జోక్స్-జోక్స్
1001 వింతలు-విచిత్రాలు
నవ్వులు
ఖగోళశాస్త్రం-క్విజ్
కార్టూన్లు

రాబిన్‌హుడ్ పన్నెండు సంవత్సరాల వయసులో తన ఈడు పిల్లలందరికీ నాయకుడుగా ఉండేవాడు. పిల్లలందరూ ఎంతో అల్లరి చేసేవారు. మంచి మంచి ఆటలు ఆడుకునేవారు.

చిన్నతనం నుండీ రాబిన్‌హుడ్‌కి కత్తియుద్ధమన్నా, గుర్రపుస్వారీ అన్నా ఎంతో ఆసక్తి చూపుతుండేవాడు. గురిచూసి లక్ష్యాన్ని బాణంతో కొట్టడమనేది రాబిన్‌కి వెన్నతో పెట్టిన విద్య.

రాబిన్ ఉంటున్న పల్లెటూరు నుండి చాలా దూరంలో 'నాటింగ్‌హామ్' అనే పెద్ద పట్టణముంది. అక్కడ రాబిన్ మేనమామ ఉంటున్నాడు. అతని పేరు 'గామ్‌వెల్'!....బాగా పలుకుబడి ఉన్నవాడు. ధనవంతుడు కూడా!....

"అమ్మా! 'నాటింగ్‌హామ్'లో నీకొక అన్నయ్య ఉన్నాడని చెబుతూ ఉంటావు కదా! ... మరి మనం అక్కడకు ఎప్పుడూ వెళ్ళినట్టులేదే!.... మామయ్య ఎటువంటివాడు? మహావీరుడేనా?" అడిగాడు రాబిన్ ఒకనాడు తల్లిని.

రాబిన్ తల్లి నవ్వి "మహావీరుడేనా! అని అడుగుతున్నావా? మీ మామయ్య షేర్‌వుడ్ అడవిలోకి వెళ్ళి ఎలుగుబంటిని ఏ ఆయుధం లేకుండా ఉత్త చేతులతోనే చంపాడు తెలుసా?" అంది.

రాబిన్ ఆశ్చర్యపోయాడు!....

'నేను కూడా అటువంటి మహావీరుణ్ని కావాలి! ఆయుధాలు ఉపయోగించకుండా క్రూర జంతువుల్ని చంపాలి. వీరాధివీరుణ్ని అనిపించుకోవాలి' అనుకున్నాడు.

పదిహేనేళ్ళ రాబిన్, ఒకనాటి ఉదయాన్నే విల్లూ, బాణాలు తీసుకుని, షికారుగా షేర్‌వుడ్ అడవి లోపలికి వెళ్ళాడు.

మధ్యాహ్నమైంది. రాబిన్ ఇంటికి తిరిగి రాలేదు. తల్లిదండ్రులు ఎంతో భయపడిపోయారు.

సాయంత్రమైంది. అయినా రాబిన్ ఇంటికి రాలేదు.

రాబిన్ తండ్రి అంతటా వెదికాడు. అడవిలో కొంతదూరం వరకూ వెళ్ళి చూసాడు. ప్రయోజనం లేకపోయింది.

రాత్రి కావచ్చింది. రాబిన్ జాడలేదు. రాబిన్ తల్లి కొడుకు కోసం ఏడుస్తూ కూర్చుంది. రాబిన్ తండ్రి ఆమెను ఓదార్చాడు.

తెల్లవారింది. సూర్యుడు నడినెత్తికి వస్తున్నాడనగా రాబిన్ తీరుబడిగా ఇంటికి చేరుకున్నాడు. రాబిన్ తల్లి కొడుకుని కౌగలించుకుని ఆనంద పారవశ్యంలో మునిగిపోయింది.

"నిన్న అంతా ఎక్కడున్నావురా?...." అని రాబిన్ తండ్రి గద్దిస్తూ అడిగాడు.



రాబిన్‌హుడ్ తల్లి, రాబిన్ మేనమామ ధైర్యసాహసాల గురించి కొడుకుతో చెప్పుట!

"మామయ్య ఏ ఆయుధం లేకుండా ఎలుగుబంటిని చంపాడు. ఎక్కడైనా ఎలుగుబంటి కనిపిస్తుందేమోనని అడవి లోపలికి వెళ్ళాను. నా దురదృష్టం ఏమిటో

కానీ, ఒక్క ఎలుగుబంటి కూడా కనిపించలేదు. అడవిలో కొంతమంది నాకు ఆతిథ్యమిచ్చారు" అన్నాడు రాబిన్.

"మా అదృష్టం బాగుండబట్టి ఆ క్రూర జంతువు నీకు కనిపించలేదు. కనిపించి ఉంటే, నువ్వు మాకు శాశ్వతంగా దూరమై ఉండేవాడివి. ఇంక అడవి ఊసు ఎత్తకు!" అని రాబిన్ తండ్రి కళ్ళెర్ర చేసాడు.

'ఓహో! అడవి జీవితం ఎంత ఆనందదాయకం! ప్రకృతి అందాలన్నీ అక్కడే ఉంటాయి సుమా! పచ్చని చెట్లూ, అందమైన పూదోటలూ, ఫలవృక్షాలూ, పక్షుల కిలకిలారవాలూ, చల్లని సెలయేళ్ళూ చూడముచ్చట గొలిపే లేళ్ళూ, కుందేళ్ళూ ఎంతసేపు చూసినా తనివి తీరలేదు. ప్రకృతి పొన్నుగా అమర్చిన బండరాయిమీద పడుకుని ఆకాశం వంక చూస్తుంటే మిలమిలా మెరుస్తున్న నక్షత్రాలు రారమ్మని పిలుస్తున్న అనుభూతి ఎలా మరచిపోగలను. ఏనాటికైనా సరే, నేను షేర్‌వుడ్ అడవిలోనే కాపురం పెడతాను.' అనుకున్నాడు రాబిన్‌హుడ్.

రాబిన్‌హుడ్‌కి తన మేనమామ ఎలా ఉంటాడో తెలియదు. రాబిన్ తల్లి కూడా తన అన్నను చూసి ఎన్నో సంవత్సరాలు అయింది. ఆమెకు అన్నను చూడాలన్న కోరిక కలిగింది.

అదీ గాక, రాబిన్‌ని అన్న దగ్గర విడిచివస్తే తనంత మహావీరుడిగా రాబిన్‌ని తీర్చిదిద్దుతాడు! అన్నది రాబిన్ తల్లి ఆశ!

"రాబిన్‌ని తీసుకుని ఒకసారి మా అన్న దగ్గరకు నాటింగ్‌హామ్ వెళ్ళి వస్తాను. అతణ్ని చూసి ఎన్నో సంవత్సరాలు అయింది కదా!" అంది రాబిన్ తల్లి భర్తతో.

"ఇప్పుడు నాకు పంట కోతలకాలం!.... నీకు తోడుగా రావడం కుదరదు. మీరు వెళ్ళే దారి యావత్తూ దొంగల మయం. ప్రమాదాలు ఎక్కువ. మరొకసారి వీలు చూసుకుని వెళ్దాంలే!" అన్నాడు రాబిన్ తండ్రి.

"నేను తోడుగా వెళ్ళుతున్నాను కదా! అమ్మకేం భయం లేదులే నాన్నగారూ!.... నా దగ్గర ఖడ్గం ఉంది. విల్లూ బాణాలు ఉన్నాయి!" అన్నాడు రాబిన్ గొప్ప యోధుడిలాగ.

రాబిన్ తండ్రి, తల్లీ కొడుకులు నాటింగ్‌హామ్ వెళ్ళేందుకు అంగీకరించాడు.

మేలు జాతి గుర్రం వాళ్ళ ప్రయాణానికి సిద్ధం చేయబడింది. రాబిన్

గుర్రం మీద కూర్చున్నాడు. అతడి తల్లి వెనుక కూర్చుంది.

కొన్నిరోజులు ప్రయాణం చేసిన తర్వాత వాళ్లు నాటింగ్‌హామ్ చేరుకున్నారు. చెల్లెలినీ, మేనల్లుడ్నీ చూసి గామ్‌వెల్ ఎంతో సంతోషించాడు.

గామ్‌వెల్‌కి రాబిన్ ఈడువాడే ఒక కొడుకు ఉన్నాడు. ఆ కుర్రవాడిపేరు



రాబిన్ విలువిద్యా నైపుణ్యాన్ని అందరూ శ్రద్ధగా తిలకించుట!

'విల్‌గామ్‌వెల్'!.... కొద్దిరోజులకే రాబిన్, విల్‌గామ్‌వెల్ మధ్య గాఢమైన స్నేహం ఏర్పడింది.

"ఈరోజు నా సోదరి మారియన్ వాళ్ళ గ్రామం నుండి వస్తున్నది. ఆమె నాకు దూరపు బంధువు. మంచి చలాకీగా ఉంటుంది. మనకంటె ఒకటీ రెండు సంవత్సరాలు చిన్నది." అని రాబిన్‌తో చెప్పాడు విల్‌గామ్‌వెల్.

ఆ రోజు మారియన్ వచ్చింది. రాబిన్‌కు ఆమె బాగా నచ్చింది.

రాబిన్ తల్లి కొడుకును అన్న వద్ద విడిచిపెట్టి తిరిగి తన గ్రామం వెళ్ళి పోయింది.

సంవత్సరాలు గడుస్తున్నాయి. రాబిన్ మంచి దృఢకాయునిగా తయార



నాటింగ్‌హామ్‌లో జరుగుతున్న ఉత్సవాలకు స్నేహితులతో కలిసి వచ్చిన రాబిన్ పట్టణవాసులతో ముష్టి యుద్ధానికి దిగుట!

య్యాడు. గామ్‌వెల్ పర్యవేక్షణలో మేటి విలుకాడుగా తయారయ్యాడు. కత్తి యుద్ధంలోనూ, కర్రసాములోనూ నిష్ణాతుడయ్యాడు.

ప్రతి సంవత్సరం జరుగుతున్నట్టుగానే, ఆ సంవత్సరం కూడా నాటింగ్‌హామ్‌లో పండుగ ఉత్సవాలు ప్రారంభమయ్యాయి.

"ఈ సంవత్సరం మనం ఉత్సవాలు చూడటానికి వెళ్దాం" అన్నాడు రాబిన్ విల్‌గామ్‌వెల్‌తో.

"వద్దు! అక్కడ మన పల్లెటూరు వాళ్ళంటే పట్నం వాళ్ళు చాలా చుల కనగా చూస్తారు. ఆట పట్టిస్తారు. మనం అటువంటి చోటికి వెళ్ళకపోవడమే మంచిది!" అన్నాడు విల్‌గామ్‌వెల్.

రాబిన్‌కి పట్టుదల పెరిగింది!

"మనం ఈసారి పట్నం కుర్రవాళ్ళను ఆట పట్టిద్దాం! మన శక్తి సామ ర్థ్యాలు ఏపాటివో వాళ్ళకు రుచి చూపిద్దాం! మనం తప్పకుండా నాటింగ్‌హామ్ నగ రానికి వెళ్ళవలసిందే!" అన్నాడు రాబిన్.

"నువ్వు మా నాయకుడిగా ఉండి, పట్నం కుర్రవాళ్ళ తిక్క కుదురుస్తా నంటే, మా కుర్రవాళ్ళమంతా నీ వెనుక ఉంటాం! నువ్వు చెప్పినట్టు నడుచు కొంటాం!" అన్నారు విల్‌గామ్‌వేల్ స్నేహితులు.

అందుకు రాబిన్ అంగీకరించాడు!.... కుర్రవాళ్ళంతా కత్తులు ధరించారు. చక్కగా ముస్తాబై ఉత్సవాలకు బయలుదేరి వెళ్ళారు.

ఉత్సవం జరిగే ప్రాంతంలో వేడుకలు, వినోదాలు మహా సందడిగా జరుగు తున్నాయి.

రాబిన్‌నూ, అతడి వెనుకగా ఉన్న పల్లెటూరి కుర్రవాళ్ళనూ చూసిన పట్నం కుర్రవాళ్ళు, ఆట పట్టించాలని నిశ్చయించుకున్నారు.

పట్నం కుర్రవాళ్ళు వీళ్ళవెనుక పడి, ఈలలూ, కోతిగెంతులూ, వేళా కోళంగా సంభాషించడం ప్రారంభించారు. వాళ్ళకు వత్తాసుగా కొంతమంది దుకాణ దారులు కూడా చేరారు.

కొద్ది క్షణాలు గడిచిన తర్వాత రాబిన్ తన స్నేహితులకు కనుసైగ చేసాడు. అంతే!....విల్‌గామ్‌వెల్ తన స్నేహితునితో సహా పట్నం కుర్రవాళ్ళమీద విరుచుకు పడ్డాడు. అంతా కలిసి పట్నం కుర్రవాళ్ళను చితకబాదడం ప్రారం భించారు.

అక్కడున్న దుకాణాలను రాబిన్ తలక్రిందులుగా పడగొట్టసాగేడు. అడ్డు వచ్చిన వాళ్ళను ఎత్తి అవతలకు గిరవాటు వేయసాగేడు.

అక్కడ ఒక విధమైన ముష్టియుద్ధం ప్రారంభమైంది. రాబిన్, కుర్రవాళ్ళు అన్ని విద్యల్లోనూ బాగా ఆరితేరినవారు. విలాసాలలో మునిగితేలే పట్నం కుర్ర

వాళ్ళు వాళ్ళముందు ఆగగలరా?— బాగా దెబ్బలు తిన్న పట్నం కుర్రవాళ్ళు నేల మీద పడిపోయారు.

అదే సమయంలో రక్షకభటాధికారి గుర్రం మీద అటుగా వచ్చాడు. అతడి వెనుక బోలెడంతమంది రక్షకభటులు ఉన్నారు.



మార్కెట్ వద్దకు అప్పుడే వచ్చిన రక్షకభటులు షరీఫ్ ఆజ్ఞ మేరకు రాబిన్‌ను బంధించుట.

వాళ్ళను చూసిన పట్నం కుర్రవాళ్ళు, భయంతో తలకొక దిక్కూ పారిపోయారు.

పట్నం కుర్రవాళ్ళు దేనికి పారిపోతున్నారో తెలుసుకున్న విల్‌గామ్‌వెల్,

తన స్నేహితులను హెచ్చరించాడు. వాళ్ళుకూడా పిక్కబలంకొద్దీ పరుగు లంఘించు కున్నారు.

"రాబిన్! ఓ రాబిన్! పారిపో!.... రక్షకభటులు వచ్చేస్తున్నారు" అంటూ విల్ గామ్‌వెల్, జనంలో కలిసిపోయాడు.

అయితే రాబిన్, ఎవరి మాటా వినిపించుకోలేదు. చేతికి అందిన వాడినల్లా చితకబాదుతూనే ఉన్నాడు.

రక్షకభటులకు నాయకుడైన 'షరీఫ్' గుర్రం మీద రాబిన్ ముష్టియుద్ధం చేస్తున్న చోటికి వచ్చాడు. అదే సమయంలో రాబిన్ కొట్టిన దెబ్బలకు, నేలమీద విరుచుకు పడిపోయాడు.

"చట్ట వ్యతిరేకంగా ఒక వ్యక్తిని కొట్టి చంపిన నేరానికి ఆ కుర్రవాడిని బంధించండి. ఈడ్చుకుంటూ తీసుకుపోయి ఖైదులో పడేయండి!" అని తన భటులకు ఆజ్ఞాపించాడు షరీఫ్.

రక్షకభటులు రాబిన్ పెడరెక్కలు విరిచి కట్టి తీసుకువెళ్ళి ఖైదులో పడేసారు. రాబిన్‌ను ఉంచిన జైలు గోడలు రాతితోనే కట్టబడ్డాయి. అయితే జైలు గది పైభాగం మాత్రం చెక్కలతో తయారుచేయబడింది. ఆ చెక్కలు పురాతన కాలం నాటివి కావడంవల్ల చాలాచోట్ల విరిగిపోయి ఉన్నాయి.

రాబిన్ తలెత్తి పైకి చూసాడు! తనలో నవ్వుకుని 'గోడ పైభాగం వరకూ వెళ్ళగలిగితే తప్పించుకోవడం ఏమంత కష్టంకాదు' అనుకున్నాడు.

చీకటి పడింది!.... రాబిన్‌కి భోజనం పెట్టిన భటులు వెళ్ళిపోయారు. అంతటా నిశ్శబ్దం!.... అర్థరాత్రి దాటింది. తెల్లవారింది!.... నిద్ర లేచిన భటులు రాబిన్‌ను చూసేందుకు గది దగ్గరకు వచ్చారు. గదిలో రాబిన్ లేకపోవడం వారు గమనించారు. గది గోడల పైభాగాన ఉన్న చెక్కలు తొలగింపబడి వున్నాయి.

రాబిన్ తప్పించుకు పోయాడన్న వార్త షరీఫ్‌కు అందజేయబడింది. అతడు ఉగ్రరూపం ధరించాడు.

"రాబిన్ శవాన్ని గానీ, బ్రతికివుండగా గానీ తెచ్చి అప్పగించిన వారికి, తగిన బహుమానం యివ్వబడుతుంది!" అని ప్రకటించాడు షరీఫ్.

అంతేకాదు. భటులను గామ్‌వెల్ భవనానికీ, రాబిన్ తల్లిదండ్రులు ఉండే గ్రామానికే పంపించాడు.

రాత్రి అతి కష్టంమీద జైలు గోడను అధిరోహించిన రాబిన్‌కు పైన వున్న

చెక్కలను పగులగొట్టి క్రిందికి దూకడం ఏమంత కష్టమనిపించలేదు. ఎవరి కంటా పడకుండా అతడు మేనమామగారి ఇంటికి వచ్చాడు. రాబిన్ తప్పించుకు వచ్చినందుకు అందరూ సంతోషించారు.

"నేను యిక్కడ వుండటం క్షేమకరం కాదు. తక్షణం వెళ్ళిపోతాను" అని చెప్పి అంపది పద్మాసెలవు తీసుకుని, రాబిన్ తన గుర్రాన్ని అధిరోహించాడు.



జైలు నుండి తప్పించుకున్న రాబిన్ అశ్వారూఢుడై షేర్‌వుడ్ ఫారెస్ట్ దిక్కుగా పారిపోవుట!

రాత్రంతా అతివేగంగా ప్రయాణం చేసి, షేర్‌వుడ్ అడవి సమీపానికి చేరుకున్నాడు. అడవి అవతల భాగంలో రాబిన్ తల్లిదండ్రులు వుంటున్నారు.

'నాటింగ్‌హామ్‌లోని షరీఫ్ చాలా క్రూరుడనీ, నేర విచారణ చేయకుండానే, కఠిన శిక్షలు విధిస్తాడనీ విన్నాను. నేను ఇంటికి వెళ్ళడం, నా తల్లిదండ్రులకు క్షేమం కాదు. ఈ క్షణం నుండీ నా నివాస స్థానం షేర్‌వుడ్ ఫారెస్ట్! క్రూరమైన చట్టాలకు వ్యతిరేకంగా పోరాడుతాను. అడవిలో తలదాచుకుంటున్న నేరస్థులందర్నీ ఒకచోట చేరుస్తాను. పేదలకు, అసహాయులకు సహాయ, సహకారాలు అందిస్తాను. ధనవంతులను దోచుకుంటాను. మంచివారిని మోసం చేసే దుర్మార్గులను ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగిస్తాను. దొంగతనం నా వృత్తికాదు. హత్యలు చేయడం నా ప్రవృత్తి కాదు.'

అని నిశ్చయించుకున్న రాబిన్, తన గుర్రాన్ని షేర్‌వుడ్ ఫారెస్ట్ లోపలి భాగానికి పోనిచ్చాడు.

రాత్రంతా ప్రయాణం చేయడంవల్ల రాబిన్ బాగా అలసిపోయాడు. గుర్రాన్ని ఓ చెట్టుకు కట్టి, చెట్టు నీడలో పడుకుని, హాయిగా గుర్రుపెట్టి నిద్రపోయాడు.

## 2

షరీఫ్, రక్షకభటులను, రాబిన్ కోసం, గామ్‌వెల్ భవనానికి పంపించాడు.

"రాబిన్, నిన్ననే తన గ్రామానికి వెళ్ళిపోయాడు. ఆ గ్రామం ఇక్కడికి సలభై మైళ్ళ దూరంలో వుంది" అన్నాడు గామ్‌వెల్.

రక్షకభటులు రాబిన్‌హుడ్ తండ్రిని కలుసుకుని "ఇంగ్లండ్ మహారాజుగారి పేరున, మీ కుర్రవాడు రాబిన్‌ని అరెస్ట్ చేయడానికి వచ్చాం! ఎక్కడ మీ రాబిన్?" అని అడిగారు.

"మా రాబిన్ ఇక్కడ లేడు!....షేర్‌వుడ్ ఫారెస్ట్‌లోకి వెళ్ళిపోయాడు. మీరు అడవిలోకి వెళ్ళారంటే మీ ప్రాణాలకే అపాయం!....ఎందుకంటే, ఆ అడవి నిండా నేరాలు చేసి తప్పించుకున్న నేరస్థులే వున్నారు. వాళ్ళు నాటింగ్‌హామ్ నుండి తమను బంధించడానికి వచ్చిన రక్షకభటులను ఎందరినో చంపేసారని అందరూ చెప్పుకుంటుండగా విన్నాను. ఆ తర్వాత మీ ఇష్టం" అన్నాడు రాబిన్ తండ్రి.

రాబిన్‌హుడ్‌ని తీసుకురాకుండా రావద్దని షరీఫ్ హెచ్చరించాడు కనుక. రక్షకభటులు అడవి సమీపానికి వచ్చారు.

షేర్‌వుడ్ ఫారెస్ట్ చాలా పెద్ద అడవి. అందులో దొంగలు, హంతకులు, నేరస్థులు ఎక్కడుంటారో, క్రూరమృగాలు ఏ ప్రాంతంలో తిరుగుతుంటాయో

తెలుసుకోవడం చాలా కష్టం.

రక్షకభటులు అడవి లోపలికి వెళ్ళేందుకు భయపడ్డారు.

"అడవిలోకి వెళ్ళి ప్రాణాలు పోగొట్టుకునేకన్నా తిరిగి నాటింగ్‌హామ్ వెళ్ళి షరీఫ్‌తో ఏదో ఒక సాకు చెప్పడమే మంచిది. పదండి పోదాం" అనుకున్నారు రక్షకభటులు.



రాబిన్ వేసిన మంటలపొగను ఆధారం చేసుకుని అక్కడికి చేరిన నేరస్థులు కొంతమంది అతడిని చుట్టుముట్టుట !

రాబిన్‌హుడ్ గుర్రంమీద మధ్యాహ్నం వరకూ ప్రయాణంచేసి అడవి లోపలి భాగానికి చేరుకున్నాడు. బాగా అలిసిపోయిన రాబిన్ ఓ చెట్టునీడన విశ్రమించాడు. సూర్యరశ్మి ఎక్కువగా ప్రసరించకపోవడంవల్ల అడవిలో చలి ఎక్కువగా

ఉంటుంది.

సాయంత్రం వరకూ నిద్రపోయిన రాబిన్ చలిగాలికి లేచి కూర్చున్నాడు. చుట్టుప్రక్కల పడివున్న ఎండుపుల్లలనూ చెత్తా చెదారాన్ని ఒకచోట చేర్చి నిప్పు అంటించాడు. మంటలు, పొగ పైకిలేచాయి. మంట సమీపంగా మేనువాల్చి వెచ్చగా నిద్రపోయాడు రాబిన్.

అయితే అడవిలో ఉంటున్న నేరస్థులకు రాబిన్ వేసిన మంటల తాలూకు పొగ కనిపించింది. వాళ్ళు కత్తులు, కర్రలు పుచ్చుకుని రాబిన్ నిద్రపోతున్నచోటికి వచ్చారు.

రాబిన్‌ని తట్టిలేపి "ఏయ్ ఎవరు నువ్వు? ఎక్కడనుండి వచ్చావు?" అని గద్దించి అడిగారు.

"నేనొక నేరం చేసాను. నాటింగ్‌హామ్ షరీఫ్ నన్ను తన అతిథిగా వాళ్ళ జైలులో ఉంచుకోవాలని ప్రయత్నించాడు. నాకు ఆ జైలులో వసతి కుదరక యిక్కడ మీతోబాటు ఉందామని యిలా వచ్చాను. నన్ను చంపిగానీ బ్రతికి ఉండగాగానీ తీసుకు రమ్మని భటులను పంపుతాడు. నేను సాధారణంగా వాళ్ళ చేతికి చిక్కను. కొంతమందినైనా చంపుతాను కదా! ఆ కక్షతో వాళ్ళు నన్ను చంపేసి నా శవాన్ని షరీఫ్‌కి అందజేస్తారు. చచ్చిపోవడం నాకు యిష్టంలేదు. అందుకే యిలా వచ్చేసాను" అన్నాడు రాబిన్.

రాబిన్ మాట్లాడే హాస్యపుతీరు ఆ నేరస్థులకు బాగా నచ్చింది.

"నువ్వు మాతోబాటే ఉండవచ్చు. ఈరోజునుండే నువ్వు మాలో ఒకడివి" అన్నారు.

షేర్‌వుడ్ ఫారెస్ట్‌లో ఉంటున్న నేరస్థులంతా ఒక తరహాకు చెందినవారు. వాళ్ళు ఆవేశంలో నేరాలు చేసినావారేతప్ప వీరులు మాత్రంకాదు. వాళ్ళల్లో ఏ ఒక్కడికీ కత్తియుద్ధంరాదు. కర్ర తిప్పడం చేతకాదు. గుర్రపుస్వారీ తెలియదు.

అయితే యీ విషయంలన్నీ రాబిన్‌కు బాగా తెలుసు. అతడిలో నాయకత్వపు లక్షణాలు బాగా ఉన్నాయి. అది గమనించిన దొంగలు రాబిన్‌హుడ్‌ను తమ నాయకుడుగా ఏర్పాటు చేసుకున్నారు.

రాబిన్ తన సహచరులకు గుర్రపుస్వారీ, ఖడ్గ విద్య, కర్రసాము ఏ ఆయుధం ఎలా ఉపయోగించాలో అన్నీ బాగా నేర్పించాడు. గురిచూసి బాణాలు ఎలా విడిచిపెట్టాలో వాళ్ళచేత అభ్యసింపజేసాడు.

ఒకనాడు రాబిన్ తన మనుషులను ఒకచోట సమావేశ పరిచాడు.

"సోదరులారా! ఈ క్షణం నుండి మనం ఒక క్రమశిక్షణలో పనిచేయాలి. మనం సుశిక్షితులమైన సైనికులం!....మన ధ్యేయం పేదల రక్షణ. ధనవంతులను కొల్లగొట్టడం!.... ఎవరి ప్రాణాలకూ హానితల పెట్టకూడదు. ఇది బాగా గుర్తుంచు కోవలసిన విషయం." అన్నాడు రాబిన్.

"అలాగే చేస్తాం!.... అయితే నాదొక మనవి!" అన్నాడొక సభ్యుడు.

"ఏమిటది?"

"ఇప్పుడు మనకు తలకొక రకమైన వస్త్రాలు వున్నాయి. అలా గాకుండా మన సంఘ సభ్యులందరికీ ఒకే విధమైన వస్త్రధారణ వుంటే ఒక గుర్తింపుగా వుంటుందని నా ఉద్దేశం!" అన్నాడు ఆ సభ్యుడు.

"అవును!....మనం ఆకుపచ్చని చెట్ల క్రింద నివసిస్తున్నాము. ఆకు పచ్చని గడ్డిలో పడుకుని, నిద్రపోతున్నాము. అంతే మనలను రక్షిస్తున్నది. యీ ఆకుపచ్చని రంగు!.... కనుక మనం ఆకుపచ్చని వస్త్రాలను ధరించుదాం!...." అన్నాడు రాబిన్ హుడ్.

దానికి అందరూ సంతోషంగా అంగీకరించారు.

"మరొక్క విషయం!.... మనకు నాటింగ్‌హామ్ షరీఫ్‌వల్లా అతడి రక్షక భటులవల్లా ఎక్కువ ప్రమాదం సంభవిస్తూ ఉంటుంది. కనుక మనమొక సంకేతాన్ని ఏర్పాటు చేసుకోవాలి." అన్నాడు రాబిన్.

"అవును నిజమే!.... ఆ సంకేతాలు ఎలా ఉండాలో చెప్పండి?" అన్నాడొక సభ్యుడు.

"మీ అందరికీ నోటితో బిగ్గరగా ఈలలు వేయడం వచ్చుకదా!.... ఎవరికైనా ఎక్కడైనా ప్రమాదం సంభవిస్తే బిగ్గరగా ఒక ఈల వేయాలి. రెండు ఈలలు వేస్తే, మనవాళ్ళు పిలుస్తున్నారని అర్థం చేసుకుని అక్కడకు వెళ్ళాలి. నాకు అవసరం కలిగినప్పుడు నేను మూడు ఈలలు వేస్తాను. అప్పుడు అందరూ ఆయుధాలు ధరించి నా వద్దకు రావాలి—" అన్నాడు రాబిన్.

దానికి నేరస్థుల సంఘ సభ్యులంతా అంగీకరించారు.

ఆ రోజుల్లో చట్టాలు న్యాయాలూ చాలా క్రూరంగా వుండేవి. డబ్బున్న వాడి మాట పైచేయిగా వుండేది. అమాయకులూ నిరపరాధులూ ఘోరమైన శిక్షలకు గురి అవుతూ ఉండేవారు చిన్న నేరానికి గూడ మరణ శిక్ష అమలు జరుప

బడుతూ వుండేది. ప్రాణాలు పోగొట్టుకోవడం యిష్టం లేని నేరస్థులూ రక్షక భటుల చేత కఠిన శిక్షలు భరించలేని నిరపరాధులూ షేర్‌వుడ్ ఫారెస్ట్‌కు పారిపోయి వచ్చి రాబిన్‌హుడ్ వర్గంలో చేరిపోతూ వుండేవారు.

ఇప్పుడు రాబిన్‌హుడ్ వర్గంలో వున్న వారి సంఖ్య నూటనలభైమంది.



సన్నని మార్గం గల సెలయేటి వంతెన మీద రాబిన్‌హుడ్ ఇటుగా వేరొక వ్యక్తి అటుగా వస్తూ వంతెన మీద తారసపడుట!

అందరూ బాణాలు వేయడంలోనూ ఖడ్గ విద్యలోనూ కర్ర సాములోనూ గుర్రపు స్వారిలోనూ ఎదుటివారిని మోసం చేసి ధనం అపహరించడంలోనూ ఆరితేరిన వారే!

3

ఒకనాటి ఉదయాన్నే రాబిన్ నిద్రలేచాడు. అప్పటికే ఎవరి పనుల్లో వారు నిమగ్నమై వున్నారు. కొంతమంది బాణాలు తయారు చేస్తున్నారు మరికొంతమంది విల్లులకు తాళ్ళు బిగిస్తున్నారు. మిగిలినవారు ఫలహారాలు తయారు చేస్తున్నారు. ఫలాలు గుడారాలకు చేరవేస్తున్నారు.

'ఎవరి పనులువారు చేస్తున్నారు. నేనేం చేయాలి? ఏదో ఒకటి చేయాలి కదా! అలా అడవిలో షికారు చేసి వస్తాను' అనుకున్నాడు రాబిన్.

వెంటనే విల్లూ బాణాలు తీసుకుని షికారుగా అడవిలోకి బయలుదేరాడు. కొంతదూరం వెళ్ళిన తర్వాత రాబిన్‌కి మంచినీటి సెలయేరు కనిపించింది. దానిమీద ఒక్క మనిషి మాత్రమే వెళ్ళగలిగే చెక్కవంతెన ఉంది.

"వంతెన దాటి అవతలికి వెళ్తాం!" అనుకున్న రాబిన్ చకచక నడుచుకుంటూ వంతెన మధ్యకు చేరుకున్నాడు.

అయితే అదే సమయంలో రాక్షసుడిలాగ భయంకరంగా ఉన్న భీకరాకారుడొకడు, వంతెన అవతలివేపు నుండి నడుచుకుంటూ వంతెనకు కొంతదూరం వరకూ వచ్చేసాడు.

అప్పుడు ఇద్దరూ తలలెత్తి ఒకరినొకరు చూసుకున్నారు. ఒకరు ఇటూ, మరొకరు అటూ నడిచి వెళ్ళడం ఆ చిన్నవంతెన మీద సాధ్యంకాదు. ఎవరో ఒకరు వెనక్కి తిరిగి వెళ్ళడం తప్ప గత్యంతరం లేదు.

"నూట సలభై మంది సభ్యులున్న దళానికి నేను నాయకుడ్ని! నేనెందుకు వెనక్కి వెళ్ళాలి?" అనుకున్నాడు రాబిన్.

"ఆ వచ్చే యువకుడికి భయపడి నేనెందుకు వెనక్కి వెళ్ళాలి?" అనుకున్నాడు ఎత్తుగా బలిష్టంగా ఉన్న భీకరాకారుడు.

"ఏయ్! వెనక్కి వెళ్ళు! నేను వంతెన దాటివెళ్ళిన తర్వాత నువ్వు వెళ్ళు!" అని బిగ్గరగా కేకపెట్టాడు రాబిన్.

"ఆ పని నువ్వే చెయ్!" అన్నాడు బలిష్టకాయుడు.

తక్షణం రాబిన్ ఓ బాణంతీసి వింటికి సంధిస్తూ "వెనక్కి వెళ్ళకపోయావో, మా బాణం నీ గుండెల్లో నుండి దూసుకుపోతుంది. పెద్ద పర్వతం పడినట్టు వెళ్ళి సెలయేటిలో పడతావు జాగ్రత్త!" అన్నాడు.

దృఢకాయుడి చేతిలో లావుపాటి పెద్ద కర్ర ఒకటి ఉంది. అతడు దానిని

పైకెత్తి "నేనంత చేతకాని వాడినని భావించకు! నువ్వు నారి సారించి బాణం విడిచి పెట్టేలోగా నేనీ కర్రతో వంతెనను బ్రద్దలు కొడతాను. నువ్వు నీ విల్లూ బాణాలతో సహా వెళ్ళి నీటిలో పడతావు తెలుసా?" అన్నాడు.

"నేను నీటిలో పడేమాట ఎలా ఉన్నా, నా వింటి నుండి బయలుదేరిన బాణం ఎన్నటికీ గురి తప్పదు. నీ ప్రాణాలు పోవడం ఖాయం!" అన్నాడు రాబిన్.



'నువ్వు వెనక్కి వెళ్ళు' అంటే 'నువ్వు వెనక్కి వెళ్ళు!' అంటూ ఘర్షణపడి వాళ్ళిద్దరూ యుద్ధానికి దిగుట!

దృఢకాయుడు భయపడకుండా "నీ దగ్గర విల్లూ, బాణాలు ఉన్నాయని పెద్ద వీరుడివలె ప్రగల్భాలు పలుకుతున్నావు. నువ్వు ఉత్త పిరికివాడివి! ... చేతకాని

వద్దమ్మవు. చేవ ఉంటే చేతికర్ర తీసుకునిరా! అప్పుడు చూపిస్తాను నా తడాఖా!” అన్నాడు.

రాబిన్‌కు పౌరుషం ముంచుకొచ్చింది. వెనుదిరిగి గట్టుమీదికి వచ్చాడు. ఆ ప్రక్కనే ఉన్న చెట్టెక్కి ఓ పొడవాటి కొమ్మను విరిచి దాని ఆకులను తొలిచాడు. ఆ తర్వాత కర్రను తీసుకుని తిరిగి వంతెనమీదికి వచ్చాడు.

ఏముంది!— దృఢకాయుడూ, రాబిన్ వంతెన మధ్యలో కర్రయుద్ధానికి దిగారు. కొద్ది క్షణాలు హోరాహోరీగా పోరాటం కొనసాగింది.

దృఢకాయుడి కర్ర దెబ్బలను తప్పించుకుంటూ రాబిన్ తన కర్రతో అతడి భుజం మీద బలంగా కొట్టాడు.

దృఢకాయుడు ఆ దెబ్బను లెక్కచేయకుండా తన కర్రతో రాబిన్ చేతి మీద కొట్టాడు. ఆ దెబ్బను తాచుకోలేని రాబిన్ కాళ్ళు తడబడ్డాయి. అతడు వంతెన మీద నిలదొక్కుకోలేక అమాంతం వెళ్ళి క్రింద పారుతున్న సెలయేటి నీటిలో పడ్డాడు. దృఢకాయుడు నవ్వుతూ వంతెన దాటి యివతలి ఒడ్డుకు వచ్చాడు.

అప్పటికి రాబిన్, నీటిలో ఈదుతూ ఒడ్డెక్కి వచ్చాడు.

“ఏం? ఎలా ఉంది నా దెబ్బ యువకుడా?” అన్నాడు దృఢకాయుడు నవ్వుతూ.

రాబిన్ కూడా నవ్వి “నువ్వు వీరుడవని అంగీకరిస్తున్నాను. ఇంతకీ నువ్వు ఎక్కడ పని చేస్తున్నావు? ఈ అడవిలోకి దేనికి వచ్చావు?” అని ప్రశ్నించాడు.

“ఏం చెప్పను నా దీనగాథ! నా పేరు జాన్‌లిటిల్! ఒక్క రోజైనాసరే ఏదో ఒక పని ఎందరినో అడిగాను. కానీ ఏ ఒక్కరూ నాకు పని ఇవ్వలేదు” అన్నాడు జాన్‌లిటిల్.

“ఎందుకని?” అడిగాడు రాబిన్‌హుడ్.

“మరేంలేదు! నా మనసుకు నచ్చిన విధంగా పని చేయడం నా అలవాటు. నాకు పని యిచ్చేవాళ్ళు వాళ్ళకు నచ్చిన విధంగా పని చేయమంటారు. అదేమో నాకు నచ్చదు. పని కోసం ఎన్నోచోట్ల తిరిగాను. పని దొరకలేదు. మంచి భోజనం తిని ఎన్ని రోజులైందో!....నిన్నటి నుండీ పస్తులతోనే తిరుగుతున్నాను” అన్నాడు జాన్‌లిటిల్.

“నువ్వు మా దళంలో చేరకూడదూ?.... మా దళం సభ్యులంతా ఎంతో మంచివాళ్ళు! నీకు రుచికరమైన మంచి భోజనం పెడతారు” అంటూ రాబిన్ కొమ్ము

బూరా తీసి ముమ్మారు బిగ్గరగా ఊదాడు.

కొద్ది క్షణాలు గడిచిన తర్వాత, ఎక్కడెక్కడో ఉన్న రాబిన్ దళ సభ్యులంతా బిలబిలమంటూ అక్కడికి చేరుకున్నారు. అందరివద్దా ఆయుధాలు ఉన్నాయి. అందరూ ఒకే రకమైన ఆకుపచ్చని వస్త్రాలు ధరించి వున్నారు. అది చూసిన జాన్ లిటిల్ ఎంతో ఆశ్చర్యపోయాడు.



'ప్రయాణీకుడి కట్లు విప్పి, లిటిల్ జాన్ చేతులకు తాళ్ళు బిగించి కట్టండి! అప్పుడుగాని లిటిల్ జాన్‌కి బాధ ఎలా ఉంటుందో తెలియదు' అని రాబిన్ ఆజ్ఞాపించుట!

"చూడు జాన్ లిటిల్! వీళ్ళంతా మా దళ సభ్యులు" అని అతడికి ప

చయం చేస్తూ, తన వాళ్ళతో "ఇతడు మంచి ధైర్యశాలి!.... నన్ను వంతెన మీది నుండి వెళ్ళనీయకుండా అడ్డుకుని నాతో కర్ర యుద్ధంచేసి నీటిలోకి పడగొట్టిన వీరుడు. ఇకనుండి మనతోబాటే ఉంటాడు" అని చెప్పాడు.

అందరూ తిరిగి గ్రీన్‌వుడ్ క్యాంప్‌కు వచ్చారు.

"ఇతడికి క్రిష్టియన్ పేరు పెట్టాలి!" అన్నాడు రాబిన్.

"తన పేరు జాన్‌లిటిల్ అని చెప్పాడు కదా!....లిటిల్ ముందుకు నెట్టి, జాన్‌ని చివరకు చేర్చుదాం!" అన్నాడు ఒక సభ్యుడు.

"బాగుంది!.... అయితే ఇతడి పేరు ఇకమీదట 'లిటిల్‌జాన్' అన్నమాట!" అన్నారు అందరూ ఒకేసారి ముక్తకంఠంతో.

## 4

లిటిల్‌జాన్‌కి ఉన్నంత బలం, పోట్లాడే శక్తి రాబిన్ దళంలో ఎవరికీ లేదు.

"నేను ఏదయినా పనిమీద పరిసర ప్రాంతాలకు వెళ్ళినప్పుడు నా తర్వాత మీ అందరికీ నాయకుడుగా లిటిల్‌జాన్ వ్యవహరిస్తాడు. మీరందరూ అతడి ఆజ్ఞలను పాటించాలి" అని చెప్పి రాబిన్ లిటిల్‌జాన్‌ని ఉపనాయకుడుగా నియమించాడు.

ఒకసారి రాబిన్ పనిమీద ఎక్కడికో వెళ్ళాడు. ఎవరో ఒక యాత్రికుడు అడవిగుండా రావడం లిటిల్ జాన్ కంటపడింది. అతడు కొంతమందిని తీసుకువెళ్ళి ఆ యాత్రికుడ్ని పట్టుకున్నాడు. అంతేకాదు! అతడి చేతులు బలమైన తాళ్ళతో, వెనక్కి విరిచి కట్టాడు.

"ఈ ఖైదీని మన రహస్య స్థావరానికి తీసుకురండి!....మన నాయకుడు రాబిన్ ఇతడి విషయమేమిటో ఆరా తీస్తాడు" అని చెప్పాడు లిటిల్‌జాన్.

అందరూ కలిసి ఆ వ్యక్తి కళ్ళకు గంతలుకట్టి రహస్య స్థావరానికి తీసుకువచ్చారు.

రాబిన్ ఆ వ్యక్తి చేతులవంక చూసాడు. తాళ్ళతో బలంగా బిగించి కట్టడంవల్ల రక్తం చిమ్ముతూ కనిపించాయి.

రాబిన్ కోపంగా "ఇతడి చేతులను ఎవరు యిలా తాళ్ళతో బంధించింది?" అని అడిగాడు.

"నేనే బంధించాను" అన్నాడు లిటిల్‌జాన్.

అప్పుడు రాబిన్ తన మనుషులతో "ఇతడి చేతి కట్లను విప్పండి! అదే తాళ్ళతో లిటిల్ జాన్ చేతులను వెనక్కి విరిచి పట్టుకొని బలంగా బిగించి కట్టండి" అంటూ ఆజ్ఞాపించాడు.

లిటిల్ జాన్, తమ నాయకుడి ఆజ్ఞను శిరసావహించాడు. చేతులు వెనక్కి పెట్టి నిలుచున్నాడు. కొంతమంది యాత్రికుడి కట్లువిప్పి ఆ తాళ్ళతో లిటిల్ జాన్ చేతులను బిగించి కట్టారు.

కొద్దిక్షణాలు గడిచేసరికి లిటిల్ జాన్ చేతులకు కట్టిన తాళ్ళ వద్ద రక్తం చిమ్మడం ప్రారంభించింది. అతడు బాధను భరించలేకపోయాడు.

"చూశావా లిటిల్ జాన్!....ఎంతటి బాధను అనుభవించావో గమనించావు కదా!....అంతటి బాధనే ఇతడు కూడా అనుభవించి ఉంటాడని యిప్పటికయినా తెలుసుకో! మన లక్ష్యం దోషులనుకానీ నిర్దోషులనుకానీ బాధించడం కాదు. పేదలకు సహాయం చేయడం, ధనవంతులను దోచుకోవడం! ...ఇతడు ఎవరో షేర్‌వుడ్ ఫారెస్ట్‌లోనికి దేనికి వచ్చాడో విచారించావా?....ఎవరయినా సరే మనతో తమ కష్టాలు చెప్పుకుంటే తప్పనిసరిగా ఆదుకుంటాం. అబద్ధాలు చెప్పి మనలను మోసం చేయాలని చూస్తే దానికి తగిన ఫలం అనుభవించేటట్టు చేస్తాం!....బాధ అనేది ఎలా ఉంటుందో నీకు తెలియజెప్పాలనే యిలా చేసాను" అంటూ రాబిన్ లిటిల్ జాన్ చేతికట్లను స్వయంగా విప్పదీసాడు.

"క్షమించు రాబిన్!....నీ పద్ధతులనూ, నీ దయార్ద్ర హృదయాన్నీ తెలుసుకోలేకపోయాను" అన్నాడు లిటిల్ జాన్.

రాబిన్ ఆ యాత్రికుణ్ని కూర్చోమని చెప్పి "ఎవరు నువ్వు? ఒంటరిగా యీ అడవిలోకి దేనికి వచ్చావు?" అని ప్రశ్నించాడు.

"నేనొక వస్త్రాల వ్యాపారిని! నేను నా గుర్రంమీద పేదసాదలకు ఉపయోగపడే ముతకవస్త్రాలను వేసుకుని, అడవి అవతల ఉండే పేదలకు అమ్ముదామని నాటింగ్‌హామ్‌నుండి వస్తున్నాను. అడవిలోకి వచ్చిన తర్వాత నాకు దాహం వేసింది. గుర్రాన్ని చాటుగా ఓ చెట్టుకుకట్టి నీళ్ళు తాగుదామని సెలయేటి దగ్గరకు వస్తుండగా మీ మనుషులు వచ్చి నన్ను పట్టుకుని బంధించారు" అని చెప్పాడు వస్త్రాల వ్యాపారి.

"నిజమే చెబుతున్నావా? నీ గుర్రం మీద ఉన్న బట్టల మూటలలో ధనవంతులకు, డబ్బున్న అధికారులకు పనికివచ్చే విలువైన వస్త్రాలు లేవు కదా!....

పేదవాళ్ళకు ఉపయోగపడే వస్త్రాలు అయితే నీకు మంచి భోజనం పెట్టి స్వేచ్ఛగా విడిచి పెడతాము. అబద్ధం చెప్పావో నీ గుర్రాన్నీ, వస్త్రాలనూ, నువ్వు దాచు కున్న ధనాన్నీ మొత్తం దోచుకుంటాము." అన్నాడు రాబిన్.

"లేదు! నేను చెప్పింది యదార్థం!" అన్నాడు వస్త్రాల వ్యాపారి.



ప్రయాణీకుడు ఓ బట్టల వ్యాపారి!.... రాబిన్ అతడికి భోజనం ఏర్పాటు చేయుట!

కొంతమంది వెళ్ళి వస్త్రాల వ్యాపారి గుర్రాన్ని తీసుకొచ్చారు. రాబిన్ ఎదుట మూటలను విప్పి చూసారు.

అతడు చెప్పింది నిజమే!— ఆ బట్టలన్నీ ముతకవస్త్రాలే!

"నిజం చెప్పావు! నిన్ను స్వేచ్ఛగా విడిచి పెడుతున్నాము" అన్నాడు రాబిన్.

"నువ్వు దయార్ద్రహృదయుడవనీ నలుగురూ చెప్పుకుంటున్నట్టు, దారి దోపిడీ దొంగవుకావనీ నేను వెళ్ళిన ప్రతిగ్రామంలోనూ చెబుతాను. అంతేకాదు. ఈసారి తిరిగి వచ్చేటప్పుడు మీ అందరికీ కావలసిన ఆకుపచ్చని వస్త్రాలుకొని తీసుకు వస్తాను" అన్నాడు వస్త్రాల వ్యాపారి.

"వాటికి బోలెడు డబ్బు ఖర్చు అవుతుంది కదా! అంత సొమ్ము మేము ఎలా యిస్తామని అనుకుంటున్నావు?" అన్నాడు రాబిన్ నవ్వుతూ.

"మీరు యివ్వగలరు! ధనవంతులను దోచుకున్న ధనం మీ వద్ద బోలెడంత ఉందని నాటింగ్‌హామ్‌లో అందరూ చెప్పుకుంటూ ఉంటారు. నేను తెచ్చిన వస్త్రాలకు మీరు డబ్బు యివ్వరేమోనన్న బెంగ నాకు లేదు." అన్నాడు వ్యాపారి.

ఆ తర్వాత అతడు తన మార్గాన గుర్రాన్ని నడిపించుకుంటూ వెళ్ళి పోయాడు.

రెండు రోజులు పోయిన తర్వాత ఆ వ్యాపారి తిరిగి అటుగా వచ్చాడు. ఈసారి అతడు ఆకుపచ్చని వస్త్రాల మూటలను తెచ్చాడు. రాబిన్ సహచరులు వాటిని చూసి ఎంతో సంతోషించారు.

ఆ వస్త్రాలకు ఎంత ఖర్చు అయిందో తెలుసుకుని దానికి అదనంగా కొంత ధనం యిచ్చి వస్త్రాల వ్యాపారిని, సంతోషంగా సాగనంపాడు రాబిన్!—

వస్త్రాల వ్యాపారి గుర్రాన్ని తీసుకుని సంతోషంగా ఇంటి దారి పట్టాడు.

అయితే అతడు మరుసటి రోజు కాళ్ళీడ్చుకుంటూ ఏడుస్తూ తిరిగి అడవిలోకి వచ్చాడు. రాబిన్‌హుడ్ మనుషులు అతడ్ని వెంటబెట్టుకుని తమ నాయకుడి వద్దకు తీసుకొచ్చారు.

"ఏం జరిగింది? ఏడుస్తున్నావెందుకు?" అని రాబిన్ అతడ్ని ప్రశ్నించాడు.

"ఏం చెప్పమంటారు? నిన్న సాయంత్రం మీ వద్ద నుండి ఆనందంగా బయలుదేరాను. కొంతదూరం వెళ్ళానో లేదో అడవిలోనే చీకటి పడిపోయింది. దానితో దారి తప్పాను. అంతలో కొంతమంది దొంగలు వచ్చి, నా వద్ద ఉన్న ధనాన్నీ, నా గుర్రాన్నీ దొంగిలించుకుపోయారు. రాత్రి అక్కడే పడుకుని తెల్లవారిన తర్వాత మీకు యీ విషయం చెబుదామని యిలా వచ్చాను" అన్నాడు బట్టల వర్తకుడు ఏడుస్తూ.

రాబిన్ తన మనుషులను అడవిలో నలుదిక్కులకూ పంపించాడు. వాళ్ళు మిట్ట మధ్యాహ్నం వరకూ అడవంతా గాలించి తిరిగి వచ్చారు.

"వర్తకుడు చెప్పింది అబద్ధమా? నిజమా?" అన్నాడు రాబిన్ ఆలోచిస్తూ.

"మేము చాలా కాలంగా ఇక్కడ ఉంటున్నాము. మనం తప్ప మరొక ముఠాకు చెందిన దొంగలు యీ షేర్‌వుడ్ ఫారెస్ట్‌లో కనిపించలేదు మరి!.... అతడు నిజమే చెబుతున్నాడో అబద్ధమే చెబుతున్నాడో ఆరా తీయవలసిందే!" అన్నారు కొంతమంది.

రాబిన్ ఆలోచించి ఇద్దరు సహచరులను పిలిచి వారికి రహస్యంగా ఏదో చెప్పి పంపించాడు.

తర్వాత వస్త్రాల వ్యాపారితో "మనుషులను ఒకచోటికి పంపించాను. దొంగిలించబడిన నీ గుర్రం, ధనం, తప్పక దొరుకుతాయి. అంతవరకు నువ్వు మా అతిథిగా వుండవచ్చు!" అన్నాడు రాబిన్.

ఆ రాత్రి అతడు అక్కడే భోజనం చేసి నిద్రపోయాడు. తెల్లవారింది. రాబిన్ పంపిన ఇద్దరు సహచరులు తిరిగి వచ్చారు. రాబిన్ చెవిలో ఏదో రహస్య విషయాన్ని మనవి చేసారు.

రాబిన్‌కు ఎక్కడలేని ఆగ్రహం ముంచుకొచ్చింది!

"చూడు వస్త్రాల వ్యాపారీ! .... ఈ రాబిన్‌హుడ్ నువ్వు అనుకున్నంత అమాయకుడూ తెలివి తక్కువవాడూ కాదు. ఈ అరణ్యంలో ఈ రాబిన్‌హుడ్ ముఠావాళ్ళు తప్ప మరొకరు దొంగతనాలు చేసే అవకాశంలేదు. అయినా, నువ్వు మోసగాడివని తెలియక నా మనుషులను అన్ని దిక్కులకూ పంపి వాళ్ళను శ్రమ పెట్టించాను. నీ మీద అనుమానం కలిగి మా మనుషులను నాటింగ్‌హామ్‌లో వున్న నీ యింటికి పంపించాను. అక్కడ దొడ్డిలో నీ గుర్రం గుంజకు కట్టివేయబడి వుంది. అంటే నువ్వు నన్ను మోసంచేసి నా మంచి తనాన్ని ఆసరగా తీసుకుని మా నుండి ధనాన్ని పొందాలని ఆశపడ్డావు. నేను దేనినైనా క్షమిస్తాను కానీ మనిషి స్వార్థాన్నీ, మోసాన్నీ మాత్రం సహించలేను అటువంటి నీచుల్ని క్షమించను కూడా!.... నీకు తగిన శిక్ష విధిస్తాను. నువ్వు ఎంత ధనం మా నుండి తిరిగి రాబట్టాలని పథకం వేసావో అంత ధనం నీ నుండి మేము రాబట్టే వరకు నువ్వు యిక్కడే వుండు. ఆ సొమ్మును, నీ ఇంటి వాళ్ళు తెచ్చి యిచ్చేవరకు నువ్వు ఇక్కడ నుండి కదలడానికి వీల్లేదు" అన్నాడు రాబిన్.

వస్త్రాల వ్యాపారి తన తప్పు క్షమించమని కాళ్ళావేళ్ళా పడ్డాడు. అయినా రాబిన్ వినలేదు.

లిటిల్ జాన్ వస్త్రాల వ్యాపారి ఇంటికి వెళ్ళి విషయమంతా చెప్పి వచ్చాడు. వస్త్రాల వ్యాపారి కొడుకు ఆ డబ్బు తెచ్చి రాబిన్‌కి అందజేసి తండ్రిని విడిపించుకుని ఇంటికి తీసుకు వెళ్ళాడు.



రాబిన్‌హుడ్ లిటిల్ జాన్‌ని వెంటబెట్టుకుని గామ్‌వెల్ కోటకు వస్తాడు. అందరూ రాబిన్‌ని కుశల ప్రశ్నలు వేయుట!

## 5

నాటింగ్‌హామ్ వెళ్ళి తన చిన్ననాటి స్నేహితులనూ మారియాన్‌నూ మేనమామనూ చూడాలనిపించింది రాబిన్‌కి!

లిటిల్ జాన్‌ని వెంటబెట్టుకుని, రాబిన్, నాటింగ్‌హామ్ బయలుదేరాడు.

"నువ్వు కనిపిస్తే పట్టుకుని ఉరితీయాలని షరీఫ్ ఎదురు తెన్నులు చూస్తున్నాడు. మనం నాటింగ్‌హామ్ వెళ్ళడం ప్రమాదమేమో ఆలోచించావా?" అన్నాడు లిటిల్ జాన్ రాబిన్‌తో.

"ధైర్యశాలి ప్రమాదాలతో ఆడుకుంటేనే ఆనందంగా వుంటుంది. మరేం ఫర్వాలేదు. బయలుదేరు!" అన్నాడు రాబిన్.

ఇద్దరూ మారువేషాలతో నాటింగ్‌హామ్ చేరుకున్నారు. ఎలాగైతేనేమి గామ్‌వెల్ భవనానికి చేరుకున్నారు. దానిని భవనం అనేకన్నా చిన్నపాటి కోట అనడం సబబు ఆ భవనం చుట్టూ పదిగజాల వెడల్పున, లోతైన కందకం వుంది. ఆ కందకం పైవరకూ నీళ్ళు ఉన్నాయి. కోట సింహ ద్వారానికి ఎదురుగా గొలుసులతో పైకిలాగే చెక్క వంతెన కందకం మీద వుంది.

భవనంలో అడుగుపెట్టిన రాబిన్‌నూ అతడి సహచరుడైన లిటిల్ జాన్‌ని చూసి అందరూ సంతోషించారు. మారియన్ చిన్ననాటి స్నేహితుణ్ని చూసి మరింత సంబరపడి పోయింది. మేనమామ గామ్‌వెల్, అతని కొడుకు విల్ గామ్‌వెల్ రాబిన్‌ని చూస్తూనే కుశలప్రశ్నలు వేసారు. షేర్‌వుడ్ ఫారెస్ట్‌లోని జీవితం ఎలా ఉందని అడిగారు.

అంతలో గామ్‌వెల్ సేవకుడొకడువచ్చి "ప్రభూ! రాబిన్ మన భవనానికి వచ్చిన విషయం షరీఫ్‌కి తెలిసిపోయింది. రాబిన్‌ని బంధించి తీసుకురమ్మని తన భటులను పంపించాడు. అదుగో అటు చూడండి!—ఎంతమంది రక్షకభటులు చెట్ల చాటున, పొదలమాటున ఎలా నక్కి నక్కి చూస్తున్నారో!...." అని చెప్పాడు.

అందరూ భవనం పై భాగానికి వచ్చి చూసారు.

"నిజమే!....రాబిన్ ఈసారి నువ్వు తప్పించుకు వెళ్ళడం కష్టమవుతుందేమో" అన్నాడు గామ్‌వెల్.

రాబిన్ నవ్వి "మరికొద్ది క్షణాల్లో చీకటి పడబోతున్నది. ఈ రాత్రికి వాళ్ళు మనల్ని ఏమీ చేయలేరు. వాళ్ళు ఏంచేసినా తెల్లవారిన తర్వాతనే కదా!.... ఈ రాత్రికి నేనొక సాహసం చేయాలనుకొంటున్నాను. మేము ఇద్దరం ఉన్నాము. మరొక ఇద్దరు మాకు సహాయంగావస్తే చాలు" అన్నాడు.

గామ్‌వెల్ సేవకులు ఇద్దరు "మేము మీతో వస్తాము" అంటూ ముందుకొచ్చారు.

ఇకనేం!- నలుగురు కలిసి అర్ధరాత్రి సమయంలో కందకంలోవున్న నీటిలో ఈదుకొంటూ అవతలి ఒడ్డుకి చేరుకొన్నారు. సద్దు చేయకుండా షరీఫ్ మనుషులు క్యాంపువేసిన గుడారంవద్దకు చేరుకొన్నారు. పడుకొని నిద్రపోతున్న రక్షకభటుల మధ్యకుచేరి నలుగురూ కత్తులు ఏసుకొని తమలో తాము కత్తియుద్ధాలు ప్రారంభించారు.



రాత్రి కోట కందకందాటి వెళ్ళిన నలుగురు వ్యక్తుల్లో గామ్‌వెల్ సేవకు డొకడు రక్షకభటులకు దొరికిపోయాడు. వాళ్ళు అతడిని చెట్టుకు ఉరితీయడానికి ఏర్పాట్లు చేయుట !

కత్తులు ఖణేల్‌మనే శబ్దాలు రక్షకభటులకి వినిపించాయి. రాబిన్ తన అనుచరులతోవచ్చి తమమీద పడ్డాడని వాళ్ళు భావించారు.

ఏముంది!- తక్షణం కత్తులు తీసుకొని తమలో తాము నరుక్కోవడం ప్రారంభించారు.

ఒక ప్రక్కగా చీకటిలో నిలుచుని యీ వింత దృశ్యం చూస్తున్న రాబిన్ "ఇక్కడ మన పని పూర్తి అయింది. పదండి పోదాం" అన్నాడు.

నలుగురూ పరిగెత్తుకొంటూ కందకం దిక్కుగా బయలుదేరారు పారి పోతున్న నలుగురు వ్యక్తులనూ రక్షకభటులు చూసారు.

"అరుగో! పారిపోతున్నారు! వాళ్ళనుపట్టి బంధించండి" అని రక్షకభటు డొకడు గావుకేక పెట్టాడు.

రక్షకభటులు వాళ్ళ వెంట బడ్డారు. రాబిన్‌తోసహా ముగ్గురు నీటిలోకి దూకి వేగంగా ఈదుకొంటూ అవతలిగట్టుకు చేరుకున్నారు. అయితే నాలుగవ వాడైన సేవకుడు, రక్షకభటుల చేతికి దొరికిపోయాడు.

"మా సేవకుడు వాళ్ళకి దొరికిపోయాడు. పాపం! వాడిని ఆ దుర్మార్గులు ఏం చేస్తారో ఏమో!" అన్నాడు గామ్‌వెల్.

"తెల్లవారేవరకు అతడ్ని వాళ్ళు ఏమీ చేయరు. తెల్లవారిన తర్వాత ఏం చేయాలో ఆలోచిద్దాం" అన్నాడు రాబిన్.

తెల్లవారింది!- మారియన్ వచ్చి రాబిన్‌ని తట్టిలేపింది.

"అటు చూడు! ఆ దుర్మార్గులు మా సేవకుడ్ని ఉరి తీయడానికి కందకం దగ్గరగా ఉన్న పెద్ద చెట్టుకు తాడు వ్రేళ్ళాడదీస్తున్నారు" అని చెప్పింది.

రాబిన్ భవనం పైభాగానికి వెళ్ళి చూసాడు. అక్కడ గామ్‌వెల్ మొద లైన వారంతా నిలబడి చెట్టువంకే చూస్తున్నారు.

రాబిన్ అటు చూసాడు. చెట్టుకు అవతల కొద్ది దూరంలో గుడారం వుంది. చెట్టు దగ్గర మాత్రం ఇద్దరే రక్షకభటులు వున్నారు. మిగతావారు గుడారం వద్ద వున్నారు.

సేవకుడి చేతులు కట్టబడి వున్నాయి. ఒక భటుడు చెట్టు కొమ్మ ఎక్కి దానికి తాడు బిగిస్తున్నాడు. రెండవవాడు క్రింద సేవకుడు పారిపోకుండా కత్తి చేతబుచ్చుకుని కాపలా కాస్తున్నాడు.

"ఇదే మంచి అదను!.... తక్షణం రెండు జతల విల్లూ, బాణాలు తెప్పిం చండి!" అన్నాడు రాబిన్.

రెండు జతల విల్లూ, బాణాలను సేవకులు తెచ్చి యిచ్చారు.

"చూడు మామయ్యా! విలువిద్యలో నువ్వు బాగా ఆరితేరిన వాడివే కదా!....నువ్వు ఒక బాణాన్ని చెట్టు మీద తాడు బిగిస్తున్న భటుడికి గురిచూసి వదిలిపెట్టు. రెండవ బాణాన్ని క్రింద నిలుచున్న వాడికి నేను గురిచూస్తాను!.... ఇద్దరం ఒకేసారి బాణాలు ప్రయోగించాలి-" అన్నాడు రాబిన్.



రాబిన్‌హుడ్ కసాయి వాడివద్ద నుండి మాంసాన్నీ, మాంసపు బండినీ తగిన వెల యిచ్చి ఖరీదు చేయుట.

అనుకున్న ప్రకారం రెండు బాణాలూ గాలిని దూసుకుంటూ వెళ్ళాయి. చెట్టు మీద కూర్చున్నవాడు దభీమంటూ నేలమీద పడ్డాడు. క్రింద నిలబడి వున్న వాడు, గావుకేక పెట్టకుండానే వాడి ప్రాణాలు గాలిలో కలిసిపోయాయి.

సేవకుడికి విషయం అర్థమైంది. వేగంగా పరిగెత్తుకుంటూ కందకం దిక్కుగా బయలుదేరాడు. అది నలుగురు రక్షకభటులు చూసారు. సేవకుడ్ని పారిపోకుండా పట్టుకునేందుకు వెంటబడ్డారు. వాళ్ళు సేవకుడ్ని సమీపిస్తున్నారనగా, కోట పైభాగం నుండి రెండు బాణాలు రివ్వున వచ్చి ముందుగా వస్తున్న ఇద్దరు భటుల గుండెల్లో దిగబడ్డాయి.

అది చూసిన, మిగిలిన ఇద్దరు భటులూ భయంతో కొయ్యబారి తక్కున ఆగిపోయారు. అంతేకాదు. వెనుదిరిగి గుడారం దగ్గరకు పరుగు లంఘించుకున్నారు.

సేవకుడు రక్షింపబడ్డాడు!.... చావగా మిగిలిన రక్షకభటులు వెళ్ళి జరిగిన విషయాన్ని షరీఫ్‌తో చెప్పారు.

"అంతమంది వెళ్ళికూడా రాబిన్‌ని బంధించలేకపోయారు. ఇక నా తడాఖా చూపిస్తాను. చూడండి! నేనొక్కడినే యీ నా చేతులతో రాబిన్‌ని పట్టి బంధిస్తాను చూడండి!" అంటూ షరీఫ్ శపథం చేసాడు.

ఆ విషయం రాబిన్‌కి తెలిసి "షరీఫ్ శపథాన్ని ఓ సవాలుగా తీసుకుంటాను. అతడికి యీ రాబిన్ శక్తియుక్తులు ఏపాటివో చూపిస్తాను" అన్నాడు.

## 6

ఒకనాడు రాబిన్‌హుడ్ కొంత ధనాన్ని తీసుకుని నాటింగ్‌హామ్‌కి వెళ్ళే మార్గం గుండా బయలుదేరాడు. షరీఫ్‌కి తన శక్తియుక్తులు ఎలా చూపించాలా! అని ఆలోచిస్తూ నడుస్తున్న రాబిన్‌కి, తన వెనుకగా వస్తున్న ఓ గుర్రపు బండి కనిపించింది.

ఆ బండి దగ్గరకు రాగానే "బండిలో ఏముంది?" అని బండి తోలేవాడిని రాబిన్ ప్రశ్నించాడు.

"నా బండిలో పశువుల మాంసం వుంది. నాటింగ్‌హామ్ మార్కెట్‌కి తీసుకువెళ్ళి అమ్ముకుందామని బయలుదేరాను" అన్నాడు బండి తోలుతున్న కసాయివాడు.

దానితో రాబిన్ మనసులో ఓ దివ్యమైన ఆలోచన తళుక్కున మెరిసింది.

"చూడు బాబూ! నువ్వు అంతదూరం వెళ్ళి, సాయంత్రం వరకు కూర్చుని మాంసం అమ్ముకునేకన్నా మొత్తం మాంసం ఎంత ఖరీదు ఉంటుందో చెప్పు? నేను అంత సొమ్ము యిచ్చేస్తాను." అన్నాడు రాబిన్.

కసాయివాడు సంతోషిస్తూ మొత్తం మాంసానికి ధర చెప్పాడు. వాడు చెప్పిన సొమ్ము యావత్తూ ఇచ్చేసాడు రాబిన్.

"అంత మాంసాన్ని నేనొక్కడినే మార్కెట్టుకు తీసుకువెళ్ళలేను కదా!.... నీ బండికి గూడ వెలకడితే ఆ సొమ్ము కూడా యిస్తాను. ఎంచక్కా నువ్వు కొత్త బండి చేయించుకోవచ్చు." అన్నాడు రాబిన్.



తక్కువ ధరకు మాంసాన్ని అమ్ముతున్న రాబిన్ మీద మిగతా
కసాయివాళ్ళు షరీఫ్‌కు ఫిర్యాదు చేయుట!

కసాయివాడు బండిని కూడా రాబిన్‌కి అమ్మేసాడు.

"చూడు! ఎంత చక్కని దుస్తులు ధరించానో! ఇంత మంచి బట్టలతో మార్కెట్టులో కూర్చుని, మాంసం ఎలా అమ్మను చెప్పు? అందుకని నీ మురికి

బట్టలను నాకు యిచ్చేసి, నా బట్టలు తీసేసుకో!" అన్నాడు రాబిన్.

కసాయివాడు ఎంతో సంతోషిస్తూ తన బట్టలు రాబిన్‌కి యిచ్చి రాబిన్ బట్టలు తొడుక్కుని ఈలవేసుకుంటూ ఇంటికి వెళ్ళిపోయాడు.

రాబిన్ కసాయివాడి బట్టలు వేసుకుని, ముఖానికి మసిపులుముకుని మాంసం బండి తోలుకుంటూ మార్కెట్టుకు వచ్చాడు. అక్కడ చాలామంది మాంసం అమ్ముతున్నారు. రాబిన్ ఖాళీగా వున్న దుకాణం చూసుకుని, అక్కడ మాంసం అమ్మడం ప్రారంభించాడు.

అందరూ ఏ ధరకు అమ్ముతున్నారో అడిగి తెలుసుకుని తన మాంసాన్ని అందులో సగంధరకే అమ్మడం ప్రారంభించాడు. కొద్దిసేపటికే అతడి మాంసం మూడు వంతుల వరకూ అమ్ముడుపోయింది.

మిగతావాళ్ళ సరుకు అలాగే ఉంది. వాళ్ళందరికీ రాబిన్ మీద చెప్పలేనంత ఆగ్రహం ముంచుకొచ్చింది. వాళ్ళంతా రాబిన్ మీద విరుచుకు పడ్డారు.

అంతలో షరీఫ్ తన గుర్రంమీద అటుగా రావడం తటస్థించింది.

"ఏమిటి గొడవ?" అడిగాడు షరీఫ్.

మిగతా కసాయివాళ్ళు, కొత్తగా వచ్చి మాంసం చవుకగా అమ్ముతున్న రాబిన్ మీద నేరారోపణ చేసారు.

"ఎవరు నువ్వు?" అని రాబిన్‌ని అడిగాడు షరీఫ్ దర్పంగా.

రాబిన్ చేతులు జోడించి "నేనొక పేదరైతును అయ్యగారూ!" అన్నాడు వినయంగా.

"మాంసాన్ని అతి చవుకగా అమ్ముతున్నావు దేనికి? దానివల్ల నీకేం లాభం ఉంటుంది?" అని షరీఫ్ ప్రశ్నించాడు.

"ఏం చేయను అయ్యగారూ! మా గ్రామం ఇక్కడికి చాలా దూరంలో ఉంది. పశువులను అమ్మేకన్నా పశువుల మాంసం అమ్మితే కొద్దిగానైనా లాభం వస్తుందని యిలా మాంసం అమ్ముతున్నాను." అన్నాడు రాబిన్.

"వీడెవడో వెర్రిబాగుల వాడివలె ఉన్నాడు. ఈ పిచ్చిరైతువద్ద బోలెడు పశువులు ఉంటాయి. వాటిని ఏదో విధంగా చేజిక్కించుకోవాలి" అనుకున్నాడు షరీఫ్.

"నీ దగ్గర అమ్మేందుకు ఎన్ని తలకాయలు ఉన్నాయి ఏమిటి?"

"నేనెప్పుడూ లెక్కపెట్టలేదు అయ్యగారూ!.... బహుశా వందకు పైగానే

ఉండొచ్చు!" అన్నాడు రాబిన్ అమాయకంగా.

"మరి వాటిని నాకు అమ్మేయరాదూ!.... ఇలా వాటిని కోసి మార్కెట్టులో వాటి మాంసం అమ్మితే నీకు చాలా తక్కువ లాభం వస్తుంది కదా!" అన్నాడు షరీఫ్.

"మీరెంత మంచివారు అయ్యగారూ! నా వద్ద వున్న వందకు పైగా పశువులను ఏదో ఒక ధరకట్టి మీరే తీసేసుకోండి" అన్నాడు రాబిన్.

"నా జేబులో వంద పౌండ్లు వున్నాయి. నీ పశువులకు ఆ డబ్బు ఎక్కువే ననుకుంటాను. నీకు యిష్టమైతే తక్షణం మీ గ్రామానికి బయలుదేరి వెళదాం!" అన్నాడు షరీఫ్.

దానికి రాబిన్ సంతోషంగా అంగీకరించాడు.

రాబిన్ మాంసం బండిమీద షరీఫ్ గుర్రంమీద, బయలుదేరారు. వాళ్ళు షేర్‌వుడ్ ఫారెస్ట్ గుండా ప్రయాణం సాగించారు. రాబిన్‌హుడ్ తన అనుచరులతో వచ్చి ఎక్కడ మీద పడతాడోనని షరీఫ్‌కి గుండెదడ దడలాడుతూనే వుంది.

"రాబిన్‌హుడ్ గురించి మీ అభిప్రాయమేమిటి?" అని అడిగాడు రాబిన్.

"ఆ దుర్మార్గుడ్ని తప్పక, కలుసుకుంటాను. వాడిని అరెస్ట్‌చేసి జైలులో పెట్టేవరకు నాకు మనశ్శాంతి వుండదు." అన్నాడు షరీఫ్ భయం భయంగా అటు యిటు చూస్తూ.

"మీరు నిజంగా ధైర్యవంతులు సుమండీ! కాకపోతే రాబిన్‌హుడ్ వంటి గజ దొంగను మీరొక్కరే మీ స్వంత చేతులతో బంధిస్తానని, శపథం చేయరుకదా!" అన్నాడు రాబిన్ నవ్వుతూ.

వాళ్ళు ఆ విధంగా అడవిలో చాలా దూరం వచ్చేసారు. అక్కడకు కొద్ది దూరంలో వేళ్ళమంద ఒకటి పచ్చిక మేస్తూ కనిపించింది.

"అదుగో అయ్యగారూ!.... నా పశువుల మంద!....నా వంద పౌండ్లు నాకు యిచ్చేసి ఆ మందను మీ ఇంటికి తోలుకు పొండి" అన్నాడు రాబిన్.

షరీఫ్ రాబిన్ వంక గుడ్లురుముతూ చూసి "ఏమిట్రా నాతో వేళాకోళ మాడుతున్నావా? అవి ఇంగ్లండ్ ప్రభువులవారి స్వంతవేళ్ళమంద!.... వాటిని నీ పశువులని చెప్పినన్నే మోసం చేయాలని చూస్తున్నావా?....జాగ్రత!" అన్నాడు.

"ఏం చేయను చెప్పండి అయ్యగారూ! మీ వంటి ధనవంతులను మోసం చేయడమేకదా నా వృత్తి!.... ఓహో! నేనెవరో మీకు తెలియాలికదూ!" అంటూ

రాబిన్ తన కొమ్ము బూరాతీసి ముమ్మారు బిగ్గరగా ఊదాడు.

మరుక్షణంలో రాబిన్ అనుచరులు బిలబిలమంటూ అక్కడికి చేరుకున్నారు. షరీఫ్‌కి నోటమాట రాలేదు.



ఇంగ్లండు ప్రభువుకు అంగరక్షకుడైన సర్ రిచర్డ్‌లీ షేర్‌వుడ్ ఫారెస్టుగుండా వస్తున్నప్పుడు లిటిల్ జాన్ అతడిని విందుకు ఆహ్వానించుట !

అయినా బింకరంగా "నువ్వు రాబిన్‌హుడ్‌వి! నిన్ను కలుసుకున్నందుకు నాకు చాలా సంతోషంగా వుంది! ఇక నేను నా కోటకు వెళతాను." అన్నాడు షరీఫ్.

"ఎంతమాట! మా అరణ్యానికి వచ్చి మా ఆతిథ్యం స్వీకరించకుండా వెళతారా?...." అంటూ రాబిన్ తన సహచరులకు సైగ చేసాడు.

వెంటనే ఇద్దరూ ముందు కొచ్చి షరీఫ్‌ని గుర్రం మీద నుంచి నేలకు దించారు. లిటిల్ జాన్ వచ్చి షరీఫ్ కళ్ళకు గంతలు బిగించి కట్టాడు.

అందరూ కలిసి 'గ్రీన్‌వుడ్ క్యాంప్‌కు వచ్చారు.' షరీఫ్ కళ్ళకు గట్టిన గంతలు విప్పబడ్డాయి. అతడికి రుచికరమైన భోజనం వడ్డించారు.

భోజనం చేసిన తర్వాత "ఇక నేను వెళ్ళొస్తాను" అన్నాడు షరీఫ్.

"ఎలా వెళతారు? నేను మీకు నా పశువుల మందను అమ్మేసాను. కనుక మీరు నాకు వంద పౌండ్లు యివ్వవలసిందే!....చూస్తారేం? షరీఫ్ బట్టలన్నీ వెదికి ఆ డబ్బును తీసుకోండి!" అన్నాడు రాబిన్.

లిటిల్ జాన్ షరీఫ్ బట్టలన్నీ సోదాచేసి, వందపౌండ్ల బంగారు నాణేలను తీసుకున్నాడు.

"షరీఫ్‌గారు మన అతిథి! అతడి కళ్ళకు తిరిగి గంతలుకట్టి అడవి దాటించి, నాటింగ్‌హామ్‌కు వెళ్ళేదారిలో వదిలేసిరండి!" అన్నాడు రాబిన్.

లిటిల్ జాన్ అలాగే చేసాడు. రాబిన్‌హుడ్‌ని తానొక్కడే బంధిస్తానని ప్రగల్భాలు పలికి అతడిని బంధించకపోగా జేబులో ఉన్న వందపౌండ్ల సొమ్మును పోగొట్టుకున్నానే అని షరీఫ్ ఎంతో బాధపడిపోయాడు.

"ఎప్పటికైనా సరే! రాబిన్‌హుడ్‌ని పట్టి బంధించి ఉరికంబ మెక్కించక పోతే నేను రక్షకభట అధికారినే కాదు" అని శపథం చేసాడు షరీఫ్.

## 7

మహావీరుడైన సర్ రిచర్డ్ఆఫ్‌లీ ఒకసారి షేర్‌వుడ్ ఫారెస్ట్‌గుండా నాటింగ్‌హామ్ సమీపంలో ఉన్న ఓ చర్చికి వెళ్ళడం తటస్థించింది. అతడు ఆ చర్చి లాలూకు మతాధికారివద్ద కొంత డబ్బు అప్పుగా తీసుకున్నాడు. ఆ విషయమై మతాధికారితో మాట్లాడటానికి వెళుతున్నాడు.

అలా గుర్రంమీద వస్తున్న సర్‌రిచర్డ్‌ని లిటిల్ జాన్ చూశాడు. సాధారణంగా ఇంగ్లండ్ చక్రవర్తివద్ద 'వీరాధివీరుడు' అనేబిరుదు పొందినవారు ధనవంతులే ఉంటారు. చాలాక్రూరులుగా కూడా ఉంటారు. రాబిన్‌హుడ్ చాలామందిని అటకాయించి, వాళ్ళవద్ద నుండి ఎంతో ధనాన్ని వసూలు చేసాడు.

అందుకని, లిటిల్ జాన్ సర్ రిచర్డ్‌ని అడ్డగించి చాలా దూరంనుండి వస్తు న్నట్టున్నారు. దయచేసి మీరు మా యజమాని వద్దకురండి! అక్కడ మా ఆతిధ్యం స్వీకరించి మరీ వెళ్ళవచ్చును అన్నాడు వినయంగా.

"ఎవరు మీ యజమాని?" అని అడిగాడు సర్ రిచర్డ్.

"మా యజమానిపేరు రాబిన్‌హుడ్!" అన్నాడు లిటిల్ జాన్.

"ఓ! రాబిన్‌హుడ్ మీ యజమాని అన్నమాట! అతడి గురించి చాలా విన్నాను. ఒకసారి అతడ్ని చూడాలని ఉంది. పద వెళదాం" అన్నాడు రిచర్డ్.

లిటిల్ జాన్ అతడి కళ్ళకు గంతలుకట్టి, తమ గ్రీన్‌వుడ్ క్యాంపుకు తీసుకు వచ్చాడు.

రాబిన్, సర్ రిచర్డ్‌వంక పరిశీలనగా చూసాడు. అతడు ధనమున్న వ్యక్తిగా కనిపించేచదు. అతడు ధరించిన శిరస్త్రాణం, కవచం, వస్త్రాలు బాగా మాసిపోయి ఉన్నాయి. గుర్రం వీపుమీద వేసే తోలుపట్టాకూడా చినిగిపోయి ఉంది.

"మీరు చాలా దీనస్థితిలో ఉన్నట్టు కనిపిస్తున్నారు. ఏమిటి సర్ మీ సమస్యలు?" అని అడిగాడు రాబిన్.

ముక్కు మొగం తెలియని వారివద్ద తన సమస్యలను ఏకరవు పెట్టడం సభ్యత కాదనుకున్న సర్ రిచర్డ్ దీనంగా నవ్వి "నాబోటి వీరుడికి సమస్యలు ఏముంటాయి?" అన్నాడు.

"పోనీలెండీ!.... కనీసం యీపూట మాతోబాటే భోజనం చేసి వెళ్ళండి!" అన్నాడు రాబిన్.

బల్లమీద ఎన్నో రుచికరమైన వంటకాలు వడ్డించబడ్డాయి. ఆ అడవి ప్రాంతంలో అంత మంచి వంటకాలు తయారు చేసినవాళ్ళను మనసులో అభినందించకుండా ఉండలేక పోయాడు.

అన్నార్తులకు కడుపునిండా తృప్తిగా భోజనంపెట్టిన గృహస్థుకు కొంత ధనం యివ్వడం మన ఆచారం. కానీ నావద్ద అంతధనం లేదు. నేను మీ భోజనాన్ని అరగించలేక పోతున్నందుకు క్షమించండి!" అన్నాడు సర్ రిచర్డు.

"మీ వద్ద ఎంత డబ్బు ఉన్నదేమిటి?" అని అడిగాడు రాబిన్.

"నా వద్ద పది షిల్లింగులు మాత్రమే ఉన్నాయి" అన్నాడు రిచర్డ్.

"అదే నిజమైతే మీ వద్ద నుండి ఒక్క షిల్లింగ్ కూడా తీసుకోము. దయచేసి, మాతోబాటే కూర్చుని తృప్తిగా భోజనం చేయండి!" అన్నాడు రాబిన్.

సర్ రిచర్డ్ కూర్చుని భోజనం చేస్తుండగా, రాబిన్ లిటిల్ జాన్‌ని చాటుగా పిలిచి "నువ్వు వెళ్ళి అతడి డబ్బు సంచి గుర్రానికి తగిలించి ఉంటుంది, అందులో ఎంత డబ్బు ఉందో చూసిరా!" అని పంపించాడు.



సర్ రిచర్డ్ చర్చిలోని మతాధికారికి బాకీ ఉన్న ధనాన్ని రాబిన్‌హుడ్ అతడికి అప్పుగా యిచ్చుట

కొంతసేపటికి లిటిల్ జాన్ తిరిగివచ్చి "ఆ వీరుడు చెప్పింది నిజమే రాబిన్! అతడి డబ్బు సంచిలో ఖచ్చితంగా పది షిల్లింగులే ఉన్నాయి." అని చెప్పాడు.

భోజనాలు అయిన తర్వాత "మీరు చూస్తే ఇంగ్లండు ప్రభువుకు అంగ రక్షకులలో ఒకరు. సాధారణంగా మీరు ధనవంతులుగానే ఉండాలి. కానీ మీరు

పేదవారుగా ఉండటమేమిటి? దానికి కారణ మేమిటి? మీ బాధలు ఏమిటో నాతో చెప్పండి?" అని రాబిన్ సర్‌రిచర్డ్‌ని ప్రశ్నించాడు.

"నాదొక పెద్ద గాథ! రెండు సంవత్సరాల క్రితం వరకూ నేనూ ధనవంతుడనే!.... అయితే ఏ దేవుడు ఆగ్రహించాడో కానీ దురదృష్టం నన్ను వెంటాడింది. నాకు ఎన్నో వందల పాడి పశువులు, గొర్రెల మందలు ఉండేవి. అవన్నీ రోగాలతో చనిపోయాయి. ఉన్న ధనం యావత్తూ, నేను ఇంటలేని సమయం చూసి, దొంగలు దోచుకుపోయారు. చేతికి అందివచ్చిన నా కొడుకును ఖడ్గ విద్య పోటీలలో ఒక వీరుడు దారుణంగా చంపివేసాడు. దానితో పరిస్థితులు తారుమారు అయ్యాయి. నేను కొంత మందికి బాకీపడ్డాను. వాళ్ళ వత్తిడి ఎక్కువ కాగా నాటింగ్‌హామ్ సమీపంగా ఉండే మఠాధికారి వద్ద కొంత ధనాన్ని వడ్డీకి అప్పుగా తీసుకున్నాను.

ఆ డబ్బు తిరిగి వడ్డీతో సహా ఫలానా రోజుకు యివ్వాలి. అలా యివ్వలేని పక్షంలో నీకున్న భూములన్నిటినీ నాకు రాసి యివ్వాలి అన్నాడు మఠాధికారి. ఎటూ గత్యంతరం లేక ఆ విధంగానే కాగితం రాసి యిచ్చాను. నేను పెట్టిన గడువు రేపటితో పూర్తి అవుతుంది. నేను మఠాధికారి సొమ్మును ఎలాగూ తిరిగి యివ్వలేను. కనీసం నా భూములను అతడికి రాసి యిచ్చి, బాకీని రద్దు చేసుకుందామని వెళుతున్నాను." అన్నాడు సర్ రిచర్డ్.

రాబిన్ కొంతసేపు మౌనంగా ఉండి "నేను మీరు చెప్పిన విషయాలను నమ్ముతున్నాను. నేను మీకు డబ్బు అప్పుగా యిస్తాను. మీ దగ్గర ఉన్నప్పుడే నా బాకీ తీర్చవచ్చును. ఇంతకీ మఠాధికారి బాకీ తీర్చేందుకు, మీకు ఎంత ధనం కావాలి?" అని ప్రశ్నించాడు.

"నాలుగు వందల పౌండ్లు!" అన్నాడు సర్ రిచర్డ్.

"చూడు లిటిల్‌జాన్! నాలుగు వందల పౌండ్లు తెచ్చి సర్ రిచర్డ్ డబ్బు సంచిలో పెట్టు!" అని రాబిన్ లిటిల్‌జాన్‌తో చెప్పాడు.

ఆ రాత్రి సర్‌రిచర్డ్ గ్రీన్‌వుడ్ క్యాంపులో హాయిగా నిద్రపోయాడు. తెల్లవారిన తర్వాత సర్ రిచర్డ్ సెలయేటిలో స్నానం చేసాడు. రాబిన్ అతడికి నూతన వస్త్రాలు యిచ్చాడు.

రాబిన్ తనకు చేసిన సహాయానికి, ఆదరణకు సర్ రిచర్డ్ ఎంతో ఉప్పొంగిపోయాడు. వాళ్ళ వద్ద సెలవు తీసుకుని అతడు తిన్నగా మఠాధికారి

వద్దకు వచ్చాడు.

మఠాధికారి, న్యాయాధికారితో కలిసి న్యాయస్థానంలో కూర్చునిఉన్నాడు.

"నేను ఈనాడు, పెద్ద ధనవంతుడ్ని కాబోతున్నాను. సర్ రిచర్డ్ నా డబ్బు ఎలాగూ యివ్వలేడు. అతడి భూములన్నీ నావే !...." అన్నాడు మఠాధికారి న్యాయాధికారితో.



సర్ రిచర్డ్ అప్పుతీర్చిన డబ్బును షేర్‌వుడ్ ఫారెస్ట్‌కు అవతలవున్న వ్యక్తికి ఎక్కువ వడ్డీకి యిచ్చేందుకు మఠాధికారి తన అంగరక్షకులతో, అడవిలో ప్రవేశించుట !

అదే సమయంలో సర్ రిచర్డ్ అక్కడికి చేరుకున్నాడు.

"ఈ రోజుతో నీ గడువు పూర్తిఅయింది. నా బాకీ డబ్బు తెచ్చావా?

ఇంకేం తెస్తావులే! ఇవ్వడానికి నీదగ్గరమాత్రం ఏముంది గనుక! ...సరేలే! నీ భూము లన్నీ ఈ న్యాయాధికారి ముందు నా పేరున రాసియివ్వు!" అన్నాడు మఠాధికారి.

"తొందరపడకండి మఠాధికారిగారూ! లోకంలో అప్పుడప్పుడూ ఎన్నో మహాద్భుతాలు జరుగుతూ వుంటాయి. మీకు రావలసిన మొత్తం సొమ్ము తెచ్చాను. మీకు నేను వడ్డీతోసహా నాలుగువందల పౌండ్లు యివ్వాలి. తీసుకుని నేను రాసిన కాగితాన్ని యివ్వండి" అంటూ సర్‌రిచర్డ్ డబ్బు సంచిని తీసి న్యాయాధికారి ముందు ఉంచాడు.

అలా జరుగుతుందని భావించని మఠాధికారి నిరాశా నిస్పృహలతో క్రుంగిపోయాడు. చేసేదిలేక ఆ డబ్బు తీసుకుని సర్‌రిచర్డ్‌కి బాకీ కాగితాన్ని యిచ్చేసాడు.

సర్‌రిచర్డ్ వెళ్ళిపోయిన తర్వాత తనకు సంక్రమించబోయే ఆస్థిని ఎవరో తన్నుకుపోయినంతగా బాధపడ్డాడు మఠాధికారి. తన బాకీక్రింద సర్‌రిచర్డ్ నాలుగువందల పౌండ్లు యిచ్చాడు. ఆ డబ్బును హెచ్చు వడ్డీకి యిచ్చి రెట్టింపు చేయాలి? ఎలాగ?' అని తెగ ఆలోచించాడు మఠాధికారి.

అదే సమయంలో ఒక వ్యక్తి మఠాధికారి వద్దకొచ్చి "అయ్యా! నేను షేర్‌వుడ్ ఫారెస్ట్ అవతలి భాగంలోవున్న నగరం నుండి వస్తున్నాను. మా యజమాని గొప్ప ధనవంతుడు. అయితే అతడికి ప్రస్తుతం పంట చేతికందలేదు. రావలసిన పైకం రాలేదు. ప్రస్తుతం అతడికి డబ్బు చాలా అవసరం. అతడికి అయిదువందల పౌండ్లు అవసరంగా ఉందట. వడ్డీ ఎంతైనా ఫర్వాలేదు అంటున్నాడు. మీరు ఆ ధనం తెచ్చియిచ్చి మీ యిష్టప్రకారమే కాగితాలు రాయించుకోవచ్చు" అన్నాడు.

"అప్పుడు మీ యజమానే యిక్కడికి రావచ్చుకదా!" అన్నాడు మఠాధికారి.

"కుదరదండీ! అతడికి బోలెడు వ్యాపకాలు! మీరు డబ్బు పుచ్చుకుని అక్కడికి వస్తే అతడి మంచీ చెడ్డా చూసుకుని కాగితాలు రాయించుకోవచ్చుకదా!.... మీరు రాని పక్షంలో మరొక వడ్డీ వ్యాపారస్తుని తీసుకురమ్మని మా యజమాని చెప్పారు" అన్నాడా వ్యక్తి.

"సరే! ఆ డబ్బు నేనే యిస్తాను. ఉండు!....నేను తగిన ఏర్పాట్లతో రావాలి కదా!" అన్నాడు మఠాధికారి.

"మేము షేర్‌వుడ్ ఫారెస్ట్‌గుండా వెళ్ళాలి. అక్కడ రాబిన్‌హుడ్‌వల్ల ఏదైనా ప్రమాదం జరుగదుందా!....ఆఁ....ఏం జరుగుతుంది. సర్‌రిచర్డ్ నాలుగు

వందల పౌండ్లు తీసుకుని ఒంటరిగా వచ్చాడు. రాబిన్‌హుడ్ అతణ్ని ఏమీ చేయలేదు కదా! నేను మఠాధికారిని. నన్ను ఎవరు అడ్డగిస్తారు. ఓ నలభై మంది ధనుర్ధారులను ఏర్పాటు చేసుకుంటాను. వాళ్ళవద్ద పన్నెండేసి పౌండ్ల ధనాన్ని దాస్తాను. నావద్ద ఇరవై పౌండ్లు దాచి ఉంచుతాను. అడవిలో రాబిన్‌హుడ్ సహచరులు ఎవరు కనిపించినా బాణాలు వేసి చంపమని నా అనుచరులను ఆజ్ఞాపిస్తాను. ఆ విధంగా మేము షేర్‌వుడ్ ఫారెస్ట్ దాటి అవతలికి వెళ్ళిపోతాము అనుకున్నాడు మఠాధికారి.

తను నిర్ణయించుకున్నట్టే చేసిన మఠాధికారి నలభై మంది అంగరక్షకులతో అడవి ప్రవేశించాడు.

ఆ విధంగా వాళ్ళు అడవిలో కొంతదూరం ప్రయాణం చేసిన తర్వాత "ఎవరా వెళ్తున్నది? అక్కడే ఆగండి! అడుగు ముందుకు వేయవద్దు!" అన్న మాటలు వినిపించి ఎక్కడివారక్కడ ఆగిపోయారు.

"చూస్తారేం? బాణాలు ఎక్కుపెట్టండి! ఎవరు కనిపించినాసరే బాణాలు ప్రయోగించి చంపండి?" అన్నాడు మఠాధికారి.

అన్నాడే కానీ అతని గుండెలు పీచు పీచుమంటూనే ఉన్నాయి. వాళ్ళకు మాటలు వినిపిస్తున్నాయి కానీ, మనుషులు కనిపించడంలేదు.

"మీరంతా ఆయుధాలు నేలమీద పడేయండి! అలా కనుక చేయక పోయారో, ముందుగా మీ యజమాని ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోతాయి. జాగ్రత్త!" అనే మాటలు వినిపించాయి.

మఠాధికారి దిక్కులు చూస్తుండగా ఒక బాణం రివ్వున గాలిని దూసుకుంటూ వచ్చి అతడి ముందున్న నేలకు గుచ్చుకుంది.

"మేము మీకు కనిపించము. కానీ మా బాణాలు మాత్రం తిన్నగా వచ్చి మీ గుండెల్లో దిగబడతాయి. విల్లూ, బాణాలు క్రింద పడేస్తారా? లేక శర వర్షం కురిపించమన్నారా?" అదృశ్య గొంతు మళ్ళీ వినిపించింది.

"బ్రతికి ఉంటే బలుసాకు అయినా తిని జీవించవచ్చు. ఈ మఠాధికారి ఉద్యోగానికి ఓ నమస్కారం. ఆయుధాలు క్రింద పారేయండి!" అన్నాడు నలభై మంది అంగరక్షకుల్లో ఒకడు.

అందరూ కలిసి విల్లూ, బాణాలు నేలమీద పడేసారు.

అంతే!....బిల బిలమంటూ రాబిన్ అనుచరులు నూట యాభైమంది వచ్చి వాళ్ళను చుట్టుముట్టారు.

లిటిల్‌జాన్, విల్‌స్కార్‌లెట్ ముందుకు వచ్చారు.

"గౌరవనీయులైన మఠాధికారిగారూ! మీరంతా మాతోబాటే వచ్చి మా యజమాని యిచ్చే ఆతిథ్యం స్వీకరించి విందుభోజనం ఆరగించి వెళ్ళవలసిందిగా మా ప్రార్థన" అన్నాడు లిటిల్‌జాన్.

వాళ్ళ యజమాని ఎవరో, విందు భోజనంలోని అంతరార్థమేమిటో మఠాధికారికి బాగా తెలుసు. అయినా తప్పదు కదా!

భోజనాలు అయిన తర్వాత, రాబిన్ మఠాధికారితో యిలా అన్నాడు : "మాతో కలిసి భోజనాలు చేసినవారు కొంత సొమ్ము మాకు చెల్లించడం ఆచారం. వాళ్ళు పేదవారు అయితే, మేము ఏమీ తీసుకోము. ధనవంతులైతే, చాలా పెద్ద మొత్తాన్నే వసూలు చేస్తాము. మీ అంగరక్షకుల వద్ద నుండి మేము ఇదివరకే, డబ్బు వసూలు చేసాము. వాళ్ళు తలకొక పన్నెండు పౌండ్లు యిచ్చారు. నా అంచనా ప్రకారం మీ వద్ద ఇరవై పౌండ్లు ఉండాలి. వాటిని చెల్లించి, మీరు మీ దారిన వెళ్ళవచ్చు."

మఠాధికారికి మతిపోయింది. దాచుకున్న ఇరవై పౌండ్లు రాబిన్ చేతబెట్టి, ఏడుపు ముఖం పెట్టుకుని, వెనుదిరిగి ఇంటికి చేరుకున్నాడు.

'మా యజమానికి అయిదు వందల పౌండ్లు అప్పుగా కావాలని' చెప్పిన వాడు, రాబిన్‌హుడ్ తాలూకా మనిషేనని పాపం, మఠాధికారికి ఏం తెలుసు?—

కొద్ది రోజులు గడిచిన తర్వాత సర్ రిచర్డ్‌కి అదృష్టం కలిసివచ్చి రాబిన్‌కి యివ్వవలసిన నాలుగు వందల పౌండ్లు తీసుకుని షేర్‌వుడ్ ఫారెస్ట్‌కి వచ్చాడు.

రాబిన్ నవ్వి "మీరు నాకు యివ్వవలసిన సొమ్మును వడ్డీతో సహా మఠాధికారి వద్ద నుండి వసూలు చేసాను. కనుక మీరు నాకు బాకీ లేరు. ఆ డబ్బు వెనక్కి తీసుకువెళ్ళి, పేదల సంక్షేమానికి వినియోగించండి!" అన్నాడు.

సర్ రిచర్డు రాబిన్‌ని ఎంతో మెచ్చుకుంటూ "నువ్వు చేస్తున్న సత్కార్యాలు నన్నెంతో ముగ్ధుణ్ని చేసాయి. అవసరం ఏర్పడినప్పుడు నేను నీకు గానీ, నీ సహచరులకు గానీ నా శక్తిమేర సహాయం చేస్తాను. ఆ విధంగా నేను ఋణ విముక్తుణ్ని అవుతాను" అని చెప్పాడు.

రాబిన్‌హుడ్, సర్ రిచర్డుకి ఎంతో గౌరవంగా, సాదర సత్కారాలతో వీడ్కోలు చెప్పాడు.

## 8

గామ్‌వెల్ కోటకు వెళ్ళాలనీ, మేనమామనూ, మారియన్‌నూ చూడాలనీ రాబిన్ కొన్ని రోజులుగా అనుకుంటున్నాడు.

ఒకనాడు అతడు మారువేషం వేసుకుని, నాటింగ్‌హామ్ మార్గం గుండా బయలుదేరాడు. మార్గమధ్యంలో అతడికి, గామ్‌వెల్ వద్ద సేవకురాలిగా పనిచేసిన ఓ ముసలిది తారసపడింది.

రాబిన్, తన మేనమామ అయిన గామ్‌వెల్ యోగక్షేమాల గురించి ఆ ముసలిదానిని ప్రశ్నించాడు.

"ఏం చెప్పమంటారు బాబూ!....మీ మేనమామ గామ్‌వెల్‌గారు యుద్ధంలో మరణించారు. గిస్‌బర్న్ ప్రభువైన సర్‌గయ్ ఇప్పుడు గామ్‌వెల్ కోటలో కాపురముంటున్నాడు" అంది ముసలిది.

"నా మేనమామ కొడుకైన విల్‌గామ్‌వెల్, మారియన్ ఇప్పుడు ఎక్కడున్నారు?.... అసలు జరిగిన విషయమేమిటి?" అని రాబిన్ ముసలిదానిని ప్రశ్నించాడు.

"పాత కక్షలు మనసులో పెట్టుకుని, సర్‌గయ్, గామ్‌వెల్ కోట మీదికి దండెత్తి వచ్చాడు. యుద్ధానికి సిద్ధంగా లేని గామ్‌వెల్, ఆ యుద్ధంలో ప్రాణాలు

పోగొట్టుకున్నాడు. కోట సర్‌గయ్ వశమైంది." అంది ముసలిది.

"విల్‌గామ్‌వెల్, మారియన్ ఏమయ్యారు?" అని అడిగాడు రాబిన్.



రాబిన్ గామ్‌వెల్ కోటకు వెళుతుండగా ముసలిది ఒకతె కనిపించి యుద్ధంలో గామ్‌వెల్ మరణించారనీ, గామ్‌వెల్ కోట యిప్పుడు సర్ గయ్ ఆధీనంలో ఉందనీ రాబిన్‌తో చెప్పుట.

"నాకు తెలియదు" ముసలిది సమాధానం చెప్పింది.

"అంటే వాళ్ళు అంతర్ధానమయ్యారా?"

"యదార్థ పరిస్థితి ఎవరికీ తెలియదు!....ఎక్కడో కోటలో వాళ్ళను బంధించి ఉంచాడని కొందరు అంటున్నారు. మరికొంతమంది, మారియాను సర్‌గయ్ వివాహం చేసుకున్నాడని అంటున్నారు. వాళ్ళను, సర్‌గయ్ చంపేసి ఉంటాడని నాటింగ్ హామ్‌లో అందరూ చెప్పుకుంటున్నారు" అంది ముసలిది.



సర్‌గయ్ మీద పగ తీర్చుకునేందుకు రాబిన్ తన అనుచరులతో సహా గామ్‌వెల్ కోటకు చేరుకొనుట.

'మారియన్ అంటే రాబిన్‌కి ఎంతో ప్రేమ. అటువంటి తన మారియాను సర్‌గయ్ కనుక చంపి ఉంటే, అతడు తన చేతిలో మరణించడం ఖాయం. ముందుగా

మారియన్ ఏమైందో తెలుసుకోవాలి!' అనుకున్నాడు రాబిన్.

అతడు యిక నాటింగ్‌హామ్ వెళ్ళకుండా, గ్రీన్‌వుడ్ క్యాంప్‌కి తిరిగి వచ్చాడు. తన వాళ్ళనందర్నీ సమావేశపరచి, తమ మిత్రుడైన గామ్‌వెల్‌కి పట్టిన దుర్గతి వివరించి చెప్పాడు.

"ఇంత ఘోరం చేసిన, సర్‌గయ్‌ని మనం విడిచిపెట్టకూడదు. మనం అతడి మీద పగ సాధించవలసిందే! ఈ రాత్రికే గామ్‌వెల్ కోట మీదికి మన దండయాత్ర!....అందరూ ఆయుధాలతో సిద్ధంగా ఉండండి!" అంటూ రాబిన్ తన అనుచరులను హెచ్చరించాడు.

ఆ రాత్రి అందరూ జట్లు జట్లుగా విడిపోయి వేరు వేరు మార్గాలలో గామ్‌వెల్ కోటకు చేరుకున్నారు.

లిటిల్‌జాన్‌నీ, విల్‌స్కార్‌లెట్‌నీ తన దగ్గరకు పిలిచి "చూడండి! మీరు ఇద్దరూ కోట కందకాన్ని ఈదుకుంటూ అవతలి ఒడ్డుకు చేరి యేదో విధంగా కోటలో ప్రవేశించండి. కోటలో యేం జరుగుతున్నదీ నిశితంగా పరిశీలించండి!.... మిగిలిన వాళ్ళం కోట వెనుక భాగానికి చేరుకుని అక్కడ కందకం దాటి కోటలోపలి భాగానికి వస్తాము. మీరు విషయ సేకరణ జరిపి కోట వెనుకభాగానికి వచ్చి అక్కడ మాకోసం నిరీక్షిస్తూ ఉండండి" అని చెప్పాడు రాబిన్.

వాళ్ళిద్దరూ నెమ్మదిగా కందకంలో దూకి ఈదుకుంటూ ముందుకు సాగి ఆ చీకటిలో అదృశ్యమైపోయారు.

రాబిన్‌హుడ్ మిగిలిన వారిని తీసుకుని కోట వెనుకభాగానికి వచ్చాడు. అక్కడనుండి అందరూ కందకందాటి త్రాళ్ళ సహాయంతో కోట లోపలి భాగానికి చేరుకున్నారు.

లిటిల్‌జాన్, విల్‌స్కార్‌లెట్ తమ నాయకుడి రాకకోసం ఎదురుచూస్తూ ఉన్నారు.

"సర్‌గయ్, కోటలో విందులూ వేడుకలూ జరుపుకుంటున్నాడు. అందరు తింటూ తాగుతూ ఆనందంలో మునిగి తేలుతున్నారు" అని చెప్పాడు లిటిల్ జాన్

"ఇదే మనకు మంచి అవకాశం!....నేనొక పథకం ఆలోచించాను. అల చేస్తే విజయం మనదే!" అన్నాడు రాబిన్.

"ఏమిటది?" అడిగాడు విల్‌స్కార్‌లెట్.



రాబిన్‌హుడ్ అతడి అనుచరులు ఎలాగో కోట లోపలికి చేరుకుంటారు. రాబిన్ ఒక్కడే ప్రధాన ద్వారంవద్దనున్న కాపలావాడితో మాట్లాడుట!

"నేను ఒంటరిగా కోట ప్రధాన ద్వారంవద్దకు వెళతాను. మీరంతా నన్ను అనుసరిస్తూ వచ్చి చీకటిలో దాగి ఉండండి!....ఏం జరుగుతుందో గమనించండి.

అప్పుడు నా ఆజ్ఞకోసం వేచి ఉండండి" అన్నాడు రాబిన్.

దానికి అతడి అనుచరులు అంగీకరించారు.

రాబిన్ నెమ్మదిగా ప్రధాన ద్వారంవద్దకు వచ్చాడు. అక్కడ ఓ భటుడు కాపలా కాస్తున్నాడు—ప్రధాన ద్వారం తలుపులు మూసి వున్నాయి.

బైటవున్న కాపలా భటుడు రాబిన్‌ని చూస్తూనే "ఏయ్! ఎవరు నువ్వు?" అంటూ గద్దించి అడిగాడు.

"నేను ఎవరయిందీ చెబుతాను. ముందు సర్‌గయ్ లోపల ఉన్నారా? లేదా? అది చెప్పు ముందు?" అన్నాడు రాబిన్.

"ఉన్నారు!-అయితే ఏమిటి?" అన్నాడు కాపలా భటుడు.

"రాబిన్‌హుడ్ తనని చూడడానికి వచ్చాడని మీ యజమానితో చెప్పు?"

కాపలా భటుడు రాబిన్ వంక ఎగాదిగా చూసి "నువ్వు ఒంటరిగానే వచ్చావా? లేక నీ వెంట నీ సహచరులు కూడా వచ్చారా?" అని ప్రశ్నించాడు.

రాబిన్ నవ్వి "ఒంటరిగానే వచ్చాను. అంత అనుమానంగా ఉంటే నలు దిక్కులా పరికించి చూడు" అన్నాడు.

కాపలా భటుడు ప్రధాన ద్వారంనుంచి కొంతదూరం నడిచి వెళ్ళి ఎవరూ లేరని నిర్ధారణ చేసుకుని తిరిగి వచ్చాడు.

"అయితే నువ్వు ఇక్కడే ఉండు! నేను వెళ్ళి ప్రభువులకు ఈ విషయం మనవిచేసి వస్తాను" అని చెప్పి కాపలాభటుడు తలుపు తీసి లోనికి వెళ్ళిపోయాడు.

వాడు సర్‌గయ్ సమీపానికి వెళ్ళి రాబిన్ విషయం మనవి చేసాడు.

సర్‌గయ్ విరగబడి నవ్వుతూ "రాబిన్‌హుడ్ వచ్చాడా? ...తక్షణం లోనికి తీసుకురా! సింహం గుహలోకి జింకపిల్ల వస్తానంటే కాదంటుందా?....తన చావును తనే కొనితెచ్చుకుంటానంటే కాదనేదేముంది!" అన్నాడు.

కాపలా భటుడు తలుపు దగ్గరకు వచ్చి రాబిన్‌ని లోనికి ఆహ్వానించాడు.

రాబిన్ తిన్నగా విందు జరుగుతున్న చోటికి వచ్చి సర్‌గయ్‌ని కలుసుకున్నాడు.

అదే సమయంలో రాబిన్ అనుచరులు చాటుగా వచ్చి కాపలా భటుడి నెత్తి పగులగొట్టి శరవేగంతో కోటలో ప్రవేశించారు.



కోట సింహద్వారం గుండా రాబిన్, అతడి అనుచరులూ కోటలో ప్రవేశించి సర్‌గయ్ సైనికులతో యుద్ధం చేయుట !

ఒక్కుమ్మడిగా సాయుధులైన రాబిన్ అనుసరులు లోనికి ప్రవేంచడం చూస్తూనే సర్‌గయ్‌కి మతి పోయింది.

"ఎవరక్కడ? సైనికులారా! కోటలో శత్రువులు ప్రవేశించారు. రాబిన్‌హుడ్ తన అనుచరులతో సహా వచ్చాడు ద్వారాలు బిగించండి! .... ఎవరూ బైటకు పోకుండా అందర్నీ నరికి పోగులు పెట్టండి!...." అంటూ సర్‌గయ్ కత్తి తీసుకుని రాబిన్ మీదికి దూకాడు.



రాబిన్‌హుడ్‌ను మాయోపాయంతో పట్టి బంధించి ఉరితీయడానికి
సర్‌గయ్, షరీఫ్, ఆలోచించి ఓ పథకం సిద్ధం చేయుట!

విందు జరిగే ఆవరణ యావత్తూ మరుక్షణంలో రణ క్షేత్రంగా మారింది.... సుశిక్షితులైన రాబిన్ అనుచరుల ముందు జీతబతేలకు ఆశపడే, సర్‌గయ్

సైనికులు ఎక్కువ సేపు నిలువలేకపోయారు. వాళ్ళు ఒక్కొక్కరే నేలకు ఒరిగి పోవడం ప్రారంభించారు.

సర్‌గయ్ కూడా రాబిన్ కత్తి ధాటికి ఆగలేక పోయాడు. ఏ క్షణంలోనైనా తన ప్రాణం పోవచ్చునన్న భయం, సర్‌గయ్‌కి పట్టుకుంది.

"సైనికులారా! దీపాలు పగులగొట్టండి ఆవరణలో కాంతి లేకుండా చేయండి!.... చీకటిలో తప్పించుకుని పారిపోండి!" అంటూ సర్‌గయ్ కేకలు పెట్టసాగేడు.

కొంత సేపటికి దీపాలన్నీ ఆరిపోయాయి. అయితే ఒక పెద్ద నూనె దీపం అక్కడున్న బల్లమీద పడి. పెద్దగా మంటలు లేచాయి. గోడకు వ్రేళ్ళాడుతున్న పరదాలు అంటుకున్నాయి.

కొద్ది క్షణాలలో కోట యావత్తూ మంటల్లో చిక్కుకుంది.

అవకాశం చిక్కిన సర్‌గయ్ కోట నుండి తప్పించుకుని పారిపోయాడు.

"సర్‌గయ్ తప్పించుకు పారిపోయాడు" అన్నాడు లిటిల్‌జాన్.

"ఇక్కడ మనకేం పని?.... పదండి! గ్రీన్‌వుడ్ క్యాంప్‌కి వెళ్ళిపోదాం!" అన్నాడు రాబిన్.

అందరూ తిరిగి షేర్‌వుడ్ ఫారెస్ట్‌కి చేరుకున్నారు.

'ఎల్‌గామ్‌వెల్ మారియన్ కోటలో లేరు. వుంటే యుద్ధం జరుగుతున్నప్పుడైనా అక్కడకు రాకుండా వుండరు. అయితే వాళ్ళు ఏమైనట్టు?' రాబిన్‌కి ఇదే ఆలోచన!—

## 9

గిస్‌బర్న్ ప్రభువైన, సర్‌గయ్ ఆ మర్నాడు తగిన సైన్యంతో తిరిగి గామ్‌వెల్ కోటకు చేరుకున్నాడు. కోట యావత్తూ కాలిబూడిద అయినందుకు అతడు ఎంతో బాధపడ్డాడు. ఆగ్రహావేశాలతో పళ్ళు కొరికాడు.

"నేను రాబిన్ మీద పగ తీర్చుకుంటాను. వాడినీ వాడి ముఠాను సర్వ నాశనం చేస్తాను." అంటూ సర్‌గయ్ శపథం చేసాడు.

తక్షణం అతడు, నాటింగ్‌హామ్ షరీఫ్ వద్దకు వెళ్ళి "నీకూ, నాకూ, కూడ రాబిన్‌హుడ్ శత్రువు వాడిని మనం తప్పకుండా హతమార్చాలి." అని చెప్పాడు.

షరీఫ్ పెదవి విరిచి "నేను అనేక విధాల ఎన్నోసార్లు రాబిన్‌ని పట్టుకుని ఉరితీయాలని ప్రయత్నించాను. కానీ ప్రతిసారీ వాడి చేతిలో ఓడిపోతూ వచ్చాను." అన్నాడు.

"ఈ విషయంలో నువ్వేమీ చేయవలసిన అవసరంలేదు. నేనొక పథకం ఆలోచించాను. అలా చేస్తాను. రాబిన్‌ని బంధించి తెచ్చి నీకు అప్పగిస్తాను. నువ్వు ఆ అడవి దొంగను ప్రజల సమక్షంలో ఉరి తీసేయ్!" అన్నాడు సర్‌గయ్.

"ఏమిటి నీ పథకం?" అడిగాడు షరీఫ్.

"నేనొక యాత్రీకుడిలాగ మారువేషం వేసుకుని షేర్‌వుడ్ ఫారెస్ట్‌లోకి వెళతాను. రాబిన్‌కి సాహసాలు చేయడమన్నా, షికారు కొట్టడమన్నా చాలా సరదా అని తెలిసింది. వాడు ఎక్కడో ఒకచోట ఒంటరిగా నా కంట బడకపోడు. వాడిని ఏదో ఒక మాయోపాయంతో బంధిస్తాను. నువ్వు నీ భటులతో షేర్‌వుడ్ ఫారెస్ట్ వెలుపల సిద్ధంగా ఉండు. రాబిన్ నా చేతికి చిక్కగానే అందుకు సూచనగా నేను వేటకు వెళ్ళేటప్పుడు పూరించే కొమ్ము బూరాను ఊదుతాను. అదే నీకు గుర్తు!" అని చెప్పాడు సర్‌గయ్.

దానితో రాబిన్‌హుడ్ దొరికినంత సంబరపడిపోయాడు నాటింగ్‌హామ్ షరీఫ్.

సర్‌గయ్ తన దుస్తుల్లో ఖడ్గాన్ని భద్రపరుచుకున్నాడు. ఆపైన పెద్ద అంగీ ధరించి యాత్రీకుడి మాదిరిగా వేషం మార్చుకున్నాడు. ఆ తర్వాత షేర్‌వుడ్ ఫారెస్ట్ దిక్కుగా కాలినడకన బయలుదేరాడు.

గామ్‌వెల్ కోటలో జరిగిన యుద్ధంలో రాబిన్ అనుచరులు ధరించే ఆకు పచ్చని దుస్తులు చాలా వరకు కాలి మసిగా మారాయి. అందువలన వాళ్ళకు కొత్త వస్త్రాలు కావలసి వచ్చాయి.



ఒకేరకం వస్త్రాలు ఎక్కువగా కొనడం చూసిన బట్టల దుకాణ దారుడికి అనుమానం వస్తుంది. రాబిన్ సహచరుల సంగతి షరీఫ్‌తో చెప్పేందుకు పరిగెత్తుకుంటూ వెళ్ళుట!-

రాబిన్, లిటిల్‌జాన్‌నీ, విల్‌స్కార్‌లెట్‌నీ పిలిచి "మీరిద్దరూ నాటింగ్ హామ్‌వెళ్ళి మన సభ్యులందరికీ సరిపడా ఆకుపచ్చని వస్త్రాలు ఖరీదు చేసుకురండి!"

అని చెప్పాడు.

వాళ్ళిద్దరూ డబ్బు తీసుకుని నాటింగ్‌హామ్ బయలుదేరారు.

"మనం కలిసి వెళ్ళడం మంచిది కాదు. నువ్వొకదారిన నేనొకదారిన నాటింగ్‌హామ్‌లో అడుగుపెడదాం!.... వస్త్రాలు నేను ఖరీదు చేస్తాను. దూరంగా నిలబడి ప్రమాదం ముంచుకు రాకుండా పరిసరాలను గమనిస్తూ ఉండు!" అని లిటిల్ జాన్‌తో చెప్పాడు విల్‌స్కార్‌లెట్.

ఇద్దరూ చెరొకదారిలో పట్టణ ప్రవేశం చేసారు.

విల్‌స్కార్‌లెట్ ఓ బట్టల దుకాణంలో తమకు కావలసిన ఆకుపచ్చని వస్త్రాలు ఖరీదు చేసి, వాటిని మూటగాకట్టి భుజాన పెట్టుకుని బయలుదేరాడు.

అతడు అటు యిటు చూసుకుంటూ ఎందుకో తలతిప్పి బట్టల దుకాణంవేపు దృష్టి సారించాడు.

ఏముంది!.... దుకాణంవాడు కొట్టు వదిలి షరీఫ్ ఉండే కార్యాలయం వేపు వేగంగా పరిగెత్తుకుంటూ వెళ్ళడం విల్‌స్కార్‌లెట్ కంటబడింది.

"ఓహో!.... వీడు షరీఫ్‌కి మా విషయం చెప్పడానికే వెళుతున్నాడు. ఇన్ని బట్టలు ఒకే దుకాణంలో కొనడం నాదే బుద్ధి తక్కువ!.... ఆకుపచ్చని వస్త్రాలు ధరించేది రాబిన్‌హుడ్ ముఠా వాళ్ళేనని అందరికీ తెలుసు!" అనుకున్న విల్‌స్కార్‌లెట్ షేర్‌వుడ్ ఫారెస్ట్ వేపు మూటతో సహా పరుగు ప్రారంభించాడు.

దూరంగా నిలబడి పరిసరాల అధ్యయనం చేస్తున్న లిటిల్‌జాన్ తలతిప్పి విల్‌స్కార్‌లెట్ వేపు చూసాడు. అతడు మూటతో సహా పరిగెత్తుకుంటూ వెళ్ళడం ప్రమాదసూచకమేనని లిటిల్‌జాన్ గ్రహించాడు.

ఆ ప్రమాదమేమిటో వెంటనే లిటిల్‌జాన్‌కి కనిపించింది. దూరంగా షరీఫ్ తాలూకు నలుగురు రక్షకభటులు విల్‌స్కార్‌లెట్ వెంటపడడం కనిపించింది.

లిటిల్‌జాన్ పరుగులాంటి నడకతో, వాళ్ళను అనుసరించాడు.

విల్ స్కార్ లెట్ దాదాపు షేర్వుడ్ ఫారెస్ట్ సమీపానికి వచ్చిన తర్వాత తను మోసుకువస్తున్న బట్టలమూటను నేలమీదికి విసిరివేసి విల్లూ, బాణం చేతికి తీసుకున్నాడు. బాణాన్ని వింటికి సంధించి, తన సమీపంగా వచ్చిన ఓ రక్షకభటుడి మీదికి విడిచిపెట్టాడు. బాణం వాడి గుండెల్లో దిగబడుతూనే పెద్దగా అరిచి నేలమీద



షేర్వుడ్ ఫారెస్ట్ వరకూ మూటతోసహా పారిపోయి వచ్చిన విల్ స్కార్ లెట్
అక్కడ మూటదించి రక్షకభటులమీద బాణ ప్రయోగం చేయుట !

పడిపోయాడు. వాడి వెనుకగావస్తున్న మరొక రక్షకభటుడు ఒరనుండి ఖడ్గం తీసి విల్ స్కార్ లెట్ మీదికి వేగంగా రాసాగేడు. విల్ స్కార్ లెట్ మరొక బాణం వాడి

మీదికి ప్రయోగించాడు. పాపం! వాడు కూడా నేలకు ఒరిగిపోయాడు.

వెనుకగా పరిగెత్తుకుంటూ వస్తున్న మిగిలిన ఇద్దరు రక్షకభటులూ తమ అనుచరుల మరణాన్ని కళ్ళారా చూసారు.

ఇంకేముంది!- వాళ్ళు తమ పురోగమనాన్ని ఆపి వెనుదిరిగి తిరోగమన మంత్రాన్ని పఠించారు.

విల్‌స్కార్‌లెట్ తిరిగి మూటను భుజానకెత్తుకుని అడవిదిక్కుగా పరుగు తీసాడు.

"భేష్! వీరుడివంటే నువ్వేనయ్యా విల్‌స్కార్‌లెట్! అద్భుతం! షరీఫ్ గాడి మనుషుల్ని లాఘవంగా నేలకు పడగొట్టి ప్రమాదంనుండి తప్పించుకున్నావు. భేష్....!" అంటూ పెద్దగా కేకలుపెడుతూ సంతోషంతో చప్పట్లుకొట్టాడు లిటిల్ జాన్.

సర్‌గయ్ చెప్పిన పథకం ప్రకారం రక్షకభటులను తోడు తీసుకుని షేర్‌వుడ్ ఫారెస్ట్‌కి వస్తున్న షరీఫ్‌కి లిటిల్‌జాన్ కనిపించాడు. అతడి మాటలను కూడా షరీఫ్ విన్నాడు. అయితే లిటిల్‌జాన్ అడవికి అభిముఖంగా ఉండటంవల్ల అతడు షరీఫ్ రావడం గమనించలేదు.

"భటులారా! ఆ కుక్కను పట్టుకోండి. వాడు రాబిన్ ముఠాకు చెందినవాడు. పారిపోనివ్వకండి బంధించండి" అంటూ షరీఫ్ గావుకేకలు పెట్టాడు.

లిటిల్‌జాన్ వెనుదిరిగి చూసాడు. అప్పటికే ప్రమాదం ముంచుకొచ్చేసింది. ఓ పాతికమంది రక్షకభటులు లిటిల్‌జాన్‌ని చుట్టుముట్టి తాళ్ళతో బంధించి పారేసారు.

పారిపోతున్న విల్‌స్కార్‌లెట్ వెనుదిరిగి చూసాడు. లిటిల్‌జాన్ షరీఫ్ మనుషులకు దొరికిపోవడం కళ్ళారా చూసాడు.

ఇక్కడికి ఈ విషయాన్ని యిలా ఉంచుదాం!-

మారువేషం ధరించిన సర్‌గయ్ మరొక దిక్కుగా షేర్‌వుడ్ ఫారెస్టులో అడుగుపెట్టాడు.

అదే సమయంలో రాబిన్‌హుడ్ మారువేషం ధరించి అడవిలో షికారుగా బయలుదేరాడు. కొంతదూరం వెళ్ళిన తర్వాత రాబిన్‌కి మారువేషంలోవున్న సర్ గయ్ తారసపడ్డాడు.



విల్ స్కార్‌లెట్ వెనుకగా పరిగెత్తుకుంటూ వస్తున్న లిటిల్ జాన్, షరీఫ్‌నూ, రక్షకభటులను చూసుకోడు. తత్ఫలితంగా అతడు రక్షకభటులకు దొరికిపోవుట !

"ఏయ్! ఎవరు నువ్వు? ఈ అడవిలో ఒంటరిగా తిరుగుతున్నావేమిటి?" అంటూ సర్‌గయ్ రాబిన్‌ని ప్రశ్నించాడు.

రాబిన్ సర్‌గయ్‌ని పోల్చుకున్నాడు.

"అయ్యా! నేను ఈ ప్రాంతానికి కొత్తవాడిని!....దారితప్పి అడవిలో తిరుగుతూవుంటే రాబిన్‌హుడ్ మనుషులు నన్ను బంధించి తమ నాయకునివద్దకు తీసుకువెళ్ళారు. రాబిన్‌హుడ్ నాకు అపకారం తలపెట్టకుండా భోజనంపెట్టి పది పౌండ్లు నా చేతికిచ్చి పంపించాడు" అని చెప్పాడు రాబిన్.

"అయితే నువ్వు రాబిన్‌హుడ్ క్యాంపునుంచే వస్తున్నావన్నమాట!.... రాబిన్‌హుడ్ ఇప్పుడు క్యాంపులోనే వున్నాడా?" అని అడిగాడు సరగయ్.

"ఆ వివరాలు మీ కెందుకు?" అన్నాడు రాబిన్ చిరాకుపడుతూ.

"ఇదుగో చూడు బాబూ! రాబిన్‌హుడ్ నీకు పది పౌండ్లు కదా యిచ్చాడు. నేను నీకు యాభై పౌండ్లు యిస్తాను. నేను ఎవరో తెలుసా? గిస్‌బర్న్ ప్రభువునైన గయ్‌ని!.... రాబిన్‌ని పట్టి అప్పగించిన వారికి రెండు వందల పౌండ్లు బహుమానంగా యిస్తానని షరీఫ్ ప్రకటించాడు. ఆ ధనాన్ని కూడా నీకే యిప్పిస్తాను. అతడి క్యాంపు ఎక్కడుందో నాకు చూపించు!" అన్నాడు సర్‌గయ్.

రాబిన్ ఆశ్చర్యాన్ని అభినయిస్తూ "రాబిన్‌హుడ్‌ని పట్టుకుని ఏం చేస్తారు?.... ఖైదులో వేస్తారా?" అని అడిగాడు.

"జైదులో వేయం!.... ఇక్కడే ఏదో ఒక చెట్టుకు ఉరితీస్తాం!" అన్నాడు సర్‌గయ్.

"మీరు ఒక్కరే వున్నారు కదా! రాబిన్‌హుడ్‌ని పట్టుకోవడం మీ వల్ల అవుతుందా?" అని అడిగాడు రాబిన్.

"లోపల అంగీలో ఖడ్గం వుంది. ఖడ్గ విద్యలో నన్ను మించినవారు లేరు. అదీగాక, నా ఖడ్గంతో వాడిని గాయపరచి మా వాళ్ళకు అంటే షరీఫ్‌కు బూర ఊది రాబిన్‌ని బంధించిన విషయం తెలియజేస్తాను. వాళ్ళు అక్కడ ఉరికి కావలసిన

ఏర్పాట్లు చేస్తారు!.... ఇక నువ్వు ఆలస్యం చేయకు, రాబిన్ ఎక్కడ ఉన్నాడో చూపించు!" అన్నాడు సర్‌గయ్ తొందర పడుతూ.

రాబిన్ నవ్వి "అంత తొందర ఎందుకు సర్‌గయ్! రాబిన్‌హుడ్‌ని పట్టుకు



మారువేషంలో, రాబిన్‌ను పట్టి బంధించాలని వచ్చిన సర్‌గయ్‌ని, రాబిన్ గుర్తిస్తాడు. అక్కడ జరిగిన కత్తి యుద్ధంలో రాబిన్, సర్‌గయ్‌ని వధించుట!

నేందుకు ఎక్కడికో వెళ్ళవలసిన అవసరంలేదు. ఇదుగో! ఇక్కడే నీ ముందే వున్నాడు!.... శక్తి వుంటే ఖడ్గ విద్యలో నన్ను జయించిన తర్వాత బంధించి

తీసుకువెళ్ళు!... అలా చేయలేని పక్షంలో నా మేనమామ సర్‌గామ్‌వెల్‌ని హత్య చేసినందుకు శిక్షగా నిన్ను నేను హతమార్చి ప్రతీకారం తీర్చుకుంటాను.” అంటూ రహస్యంగా దాచి వుంచిన ఖడ్గాన్ని తీసాడు.

సర్‌గయ్ బిత్తరపోయాడు. వెంటనే తన ఖడ్గాన్ని తీసి, రాబిన్ మీద కలియబడ్డాడు. ఇద్దరికీ ద్వంద్వ యుద్ధం ప్రారంభమైంది.

అక్కడ షరీఫ్, లిటిల్‌జాన్‌ని, ఓ పెద్ద చెట్టువద్దకు తీసుకు వచ్చాడు. ఇద్దరు భటులు లిటిల్‌జాన్ వెనుక నిలుచున్నారు.

“ఆ చెట్టుకు ఉరితాడు వ్రేళ్ళాడదీయండి! ఈ కుక్కను తక్షణం ఉరితీసి పారేయండి!” అంటూ షరీఫ్ తన మనుషులను ఆదేశించాడు.

ఇద్దరు భటులు చెట్టుపైకి ఎక్కి ఉరితాడు కట్టసాగేరు.

అదే సమయంలో దూరం నుంచి కొమ్ము బూరా శబ్దం వినిపించింది!....

షరీఫ్ సంబరపడి పోతూ “అదుగో! కొమ్ముబూరా శబ్దం! అది సర్‌గయ్ ఉపయోగించే కొమ్ము బూరాయే!.... అంటే మీ నాయకుడు రాబిన్‌హుడ్ సర్‌గయ్‌కి బందీగా చిక్కాడన్నమాట!.... భటులారా! ఈ కుక్కను అప్పుడే ఉరితీయకండి! వీళ్ళ నాయకుడ్ని తీసుకొచ్చాక ఒక్కసారే ఇద్దర్నీ ఉరితీద్దాం!” అన్నాడు.

అంతలో, సర్‌గయ్, రాబిన్‌హుడ్ చేతులకు తాళ్ళు బిగించి తీసుకురావడం కనిపించింది.

వాళ్ళు దగ్గరకు రాగానే “భేష్! రాబిన్‌హుడ్‌ని బంధించి అద్భుతమైన చరిత్రను సృష్టించారు, సర్‌గయ్!....” అంటూ అభినందించాడు షరీఫ్.

తక్షణం సర్‌గయ్ ముఖానికున్న తొడుగును, తను వేసుకున్న దుస్తులను తీసివేసాడు!....

ఏముంది!–అతడు సర్‌గయ్ కాదు; రాబిన్‌హుడ్!....రాబిన్‌హుడ్ వేషంలో ఉన్నవాడు....విల్‌స్కార్‌లెట్!....

అది చూసిన షరీఫ్ ఆశ్చర్యంతో కొయ్యబారిపోయాడు. అతడు ఆశ్చర్యం నుండి తేరుకోకముందే విల్‌స్కార్‌లెట్, లిటిల్‌జాన్ కట్లు విప్పదీసాడు.

"నీ మీద నాకు ద్వేషం లేదు. అందుకే నిన్ను చంపకుండా విడిచిపెడు



నిలువ నీడలేని విల్‌గామ్‌వెల్, మారియన్ ఇద్దరూ షేర్‌వుడ్ ఫారెస్ట్‌కు వచ్చి, రాబిన్‌ని కలుసుకొనుట!

తున్నాను. నీకు సహాయంగా వచ్చిన, సర్‌గయ్‌ని స్వర్గానికి పంపివేసాను!" అన్నాడు రాబిన్.

షరీఫ్ తెప్పరిల్లి తన భటులకు ఆజ్ఞలు జారీ చేసేలోగా, ముగ్గురు వీరులూ, మెరుపు తీగెల్లాగ తళుక్కున మెరిసి షేర్‌వుడ్ ఫారెస్ట్‌లోనికి అదృశ్యమైపోయారు.

"ఇదంతా అయోమయంగానూ, మహాద్భుతంగానూ ఉంది. ఏం జరిగిందో చెప్పండి!....నిజంగానే సర్‌గయ్ నిన్ను బంధించాడనే భ్రమపడ్డాను. ఎంత బాధ అనుభవించానో చెప్పలేను" అన్నాడు లిటిల్ జాన్.

తనకూ, సర్‌గయ్‌కూ మధ్య జరిగిన సంభాషణ, ఆ తర్వాత జరిగిన కత్తి యుద్ధం, ఆ యుద్ధంలో సర్‌గయ్ తన కత్తికి బలికావడం, వివరించి చెప్పాడు రాబిన్ హుడ్.

"నేను షరీఫ్ మనుషుల నుండి తప్పించుకుని వెళుతూ, వెనక్కి తిరిగి చూసాను. అదే సమయంలో షరీఫ్ మనుషులు నిన్ను చుట్టుముట్టి బంధించడం చూసాను. ఆ విషయం రాబిన్‌కి చెబుదామని పరుగు పరుగున వస్తుంటే, ఒకచోట, ఓ శవం, ప్రక్కగా రక్తం ఓడుతున్న కత్తితో నిలబడి వున్న మన నాయకుడు కనిపించాడు. ఆ శవం సర్‌గయ్‌ది! నువ్వు షరీఫ్ మనుషులకు దొరికిపోయిన సంగతి రాబిన్‌కి చెప్పాను. అప్పుడు రాబిన్ సర్‌గయ్ వేషంలోనూ, నేను రాబిన్ వేషంలోనూ యిక్కడికి వచ్చాము" అంటూ విల్ స్కార్‌లెట్ కథను పూర్తి చేసాడు.

ముగ్గురూ కలిసి ఆనందంగా గ్రీన్‌వుడ్ క్యాంపుకు చేరుకున్నారు—

అయితే, రాబిన్ తన చిన్ననాటి స్నేహితురాలైన మారియన్‌ను మాత్రం మరచిపోలేకపోయాడు.

'ఆమె ఏమైంది? విల్ గామ్‌వెల్ ఎక్కడున్నాడు?' తీరిక సమయాలలో రాబిన్‌కి ఇదే ఆలోచన.

ఒకనాడు రాబిన్ గ్రీన్‌వుడ్ క్యాంప్‌కు సమీపంగా వున్న పెద్ద వృక్షం క్రింద కూర్చుని మారియన్ గురించి ఆలోచించసాగేడు.

అదే సమయంలో ఒక స్త్రీ, ఒక పురుషుడు తన దిక్కుగా రావడం రాబిన్ కంట బడింది. అతడు ఖడ్గం చేతబుచ్చుకుని లేచి నిలుచున్నాడు.

వాళ్ళు రాబిన్ సమీపానికి రాగానే, వాళ్ళెవరో అతడు గుర్తించాడు.

వాళ్ళెవరో కాదు; రాబిన్ హృదయరాణి అయిన మారియన్, అతని మేన మామ కుమారుడైన విల్ గామ్‌వెల్!.... రాబిన్ వాళ్ళిద్దర్నీ గాఢాలింగనం చేసుకుని అలాగే ఉండిపోయాడు.



రాబిన్‌హుడ్ చూసేందుకు ఇంగ్లండ్ రాజు నాటింగ్‌హామ్ వచ్చి
షరీఫ్‌తో మాట్లాడుట!—

చివరకు భారంగా నిట్టూర్చి "మీరు చనిపోయారనే భావిస్తున్నాను. ఇంతకీ మీరు ఎక్కడ ఉన్నారు?" అని రాబిన్ వాళ్ళను ప్రశ్నించాడు.

"సర్‌గయ్ గామ్‌వెల్ కోట మీదికి దండెత్తి వచ్చినప్పుడు మేము దూర

ప్రాంతంలో ఉన్న బంధువులను చూడటానికి వెళ్ళాము. మేము మొన్ననే తిరిగి వచ్చాము. మా నాన్న చనిపోయిన సంగతీ గామ్‌వెల్ కోట తగులబడిపోయిన విషయమూ తెలిశాయి. నిలువ నీడ, తిన తిండిలేని మాకు నువ్వు జ్ఞాపకం వచ్చావు. వెంటనే బయలుదేరి నీ వద్దకొచ్చాము." అన్నాడు విల్ గామ్‌వెల్.

రాబిన్ ఇక ఆలస్యం చేయదలుచుకోలేదు. ఆ రోజే అతడు మారియన్‌ను, తన భార్యగా స్వీకరించాడు.

## 10

షేర్‌వుడ్ ఫారెస్ట్‌లో వున్న రాబిన్‌హుడ్ అతడి అనుచరుల దొంగతనాల గురించీ, అతడి సాహస గాథల గురించీ ఇంగ్లండ్ రాజుకు తెలిసాయి. ఇంగ్లండ్ రాజుకు రాబిన్‌హుడ్‌ని చూడాలన్న కోరిక కలిగింది.

వెంటనే అతడు నాటింగ్‌హామ్ వచ్చి షరీఫ్ కోటలో బస చేసాడు. అతడు వస్తున్నప్పుడు నాటింగ్‌హామ్ నగర గోడలమీద రాబిన్‌హుడ్ చిత్రపటాలతో కూడిన వార్తల ప్రకటనలు ఇంగ్లండ్ రాజుకు కనిపించాయి.

వాటి సారాంశం ఏమిటంటే— 'గజదొంగ రాబిన్‌హుడ్‌ని పట్టి అప్పగించిన వారికి రెండు వందల పౌండ్లు బహూమానంగా యివ్వబడుతుంది!' అని.

"పట్టణం నిండా ఆ ప్రకటనలేమిటి? ... నువ్వు యిక్కడ రక్షణశాఖ అధికారిగా ఉంటున్నావు. నీ చేతిక్రింద అయిదు వందల మంది రక్షకభటులున్నారు. నువ్వు ఆ రాబిన్‌హుడ్‌ని పట్టుకుని బంధించలేకపోవడమేమిటి?" అన్నాడు ఇంగ్లండ్ చక్రవర్తి షరీఫ్‌తో.

"వాడు నక్కజిత్తులు ప్రదర్శించడంలో ఆరితేరినవాడు ప్రభూ!.... ఎన్నో సంవత్సరాల నుండి వాడినీ, వాడి ముఠాను బంధించాలని విశ్వ ప్రయత్నం చేస్తున్నాను. అయినా ప్రయోజనం లేకపోయింది ప్రభూ!.... వాడికి తోడుగా యిప్పుడు మరొక మహావీరుడు కూడా షేర్‌వుడ్ ఫారెస్టుకు చేరాడు. దానితో వాళ్ళకు పట్టపగ్గాలు లేకుండా పోయాయి." అన్నాడు షరీఫ్ విచారంగా.

"మహావీరుడా!— ఎవరతను?" ఇంగ్లండ్ రాజు ప్రశ్నించాడు.

"తమకు తెలిసిన వీరుడే!.... సర్ రిచర్డ్ ఆఫ్‌లీ!" అన్నాడు షరీఫ్.

"అలాగా! అయితే నేను రాబిన్‌హుడ్‌ని చూడవలసిందే సుమా!" అన్నాడు ఇంగ్లండ్ రాజు.

"వద్దు ప్రభూ! వాడు మహాక్రూరుడు!.... బందిపోటు, దొంగ!.... హంతకుడు!.... తమరు షేర్‌వుడ్ ఫారెస్ట్‌కు వెళ్ళడం ప్రమాదకరం!" అన్నాడు షరీఫ్.

"అతడు మహావీరుడనీ ధైర్యశాలి అని విన్నాను. అతడు ఎక్కువకాలం పేద సాదలకు సహాయం చేయడంలోనే గడుపుతాడని కూడా విన్నాను." అన్నాడు ఇంగ్లండ్ రాజు.

"అది నిజమేననుకోండి!.... కానీ ఆ డబ్బువాడి స్వంతం కాదు. ధనవంతులను కొల్లగొట్టి ఆ డబ్బుతో పేదలను చూస్తాడు" అన్నాడు షరీఫ్.

"ఆ విషయాలను వివరంగా తెలుసుకోవాలంటే మేము ఒకసారి అతణ్ని చూడక తప్పదు." అన్నాడు ఇంగ్లండ్ రాజు.

ఆ వార్త షరీఫ్ నోటి వెంట రక్షకభటులకు, రక్షకభటుల ద్వారా నాటింగ్ హామ్ పట్టణవాసులకూ ప్రాకిపోయింది.

"ఇంగ్లండ్ రాజు, సాయుధులైన వందమంది మహావీరులతో, రాబిన్ హుడ్‌ని బంధించడానికి షేర్‌వుడ్ ఫారెస్ట్‌కి వెళతారట!... ఈ దెబ్బతో రాబిన్ హుడ్ వ్యవహారం అటో యిటో తేలిపోతుంది—" అని పట్టణవాసులు చెప్పుకో సాగేరు.

ఒకనాడు ఇంగ్లండ్ రాజు షరీఫ్‌తో కలిసి విందు ఆరగిస్తున్న తరుణంలో ఓ వ్యక్తి అక్కడికి వచ్చి ఇంగ్లండ్ రాజుకు ఓ లేఖ యిచ్చి వెళ్ళాడు.

ఇంగ్లండ్ రాజు దానిని విప్పి చూసాడు.

అందులో ఇలా ఉంది.

"ఇంగ్లండ్ మహారాజు గారికి అభివందనములు. మీరు సాయుధ సిబ్బందితో నన్ను కలుసుకునేందుకు వస్తున్న సమాచారం నాకు తెలిసింది. మీరు వంద మంది సాయుధులతోనేకాదు, ఇంగ్లండ్ రాజ్యంలో ఉన్న వేలాదిమంది మహావీరులను వెంటబెట్టుకు వచ్చినా సరే నన్ను మీరు కలుసుకోరు. బంధించలేరు కూడా! ....నన్ను కలుసుకునేందుకు ఒంటరిగావస్తే మీకు హృదయ పూర్వకమైన స్వాగతం లభిస్తుంది.... గ్రహించగలరు."

ఇట్లు
రాబిన్‌హుడ్

ఇంగ్లండ్ రాజు లేఖను చదువుకుని దానిని భద్రంగా జేబులో దాచుకున్నాడు. ఆ లేఖ ఏమిటి? అని అడిగే ధైర్యం షరీఫ్‌కి లేకపోయింది.

ఆ మర్నాడు షరీఫ్ కోటలో లేని సమయం చూసి ఇంగ్లండ్ రాజు తన వేషాన్ని మార్చుకున్నాడు. సర్వసంగ పరిత్యాగి అయిన సన్యాసి వేషం ధరించాడు. ఒంటరిగా షేర్‌వుడ్ ఫారెస్ట్ దిక్కుగా బయలుదేరాడు.

ఇంగ్లండ్ రాజు అడవిలో కొంతదూరం వెళ్ళాడో లేదో అతడికొక వింత దృశ్యం కనిపించింది.

అక్కడ ఒక పొడవాటి వ్యక్తి నడుమువంచి దేనినో చూస్తున్నాడు. అతడి చేతిలో విల్లూ, బాణాలు ఉన్నాయి. ఇంగ్లండు రాజు అతడి సమీపంగా వెళ్ళి చూసాడు.

ఏముంది!.... నేలమీద చనిపోయిన జింక ఒకటి పడి ఉంది. దానిని చూడగానే ఇంగ్లండ్ రాజుకు కోపం వచ్చింది.

"ఏంప్! ఎవరయ్యా నువ్వు! ఇంగ్లండ్ రాజుగారికి చెందిన జింకను బాణం వేసి చంపుతావా?.... అది ఎంత పెద్ద నేరమో తెలుసా నీకు?" అన్నాడు ఇంగ్లండ్ రాజు కోపంగా.

"నేను దీనిని చంపలేదు!.... మేము ప్రభువుల సంపదను జాగ్రత్తగా కాపాడుతాం. కానీ యిలా వధించము! ఆహారం కోసం మేము జింకలను చంపడం ప్రారంభిస్తే ఈ అడవిలో యీ పాటికి ఒక్క జింక కూడా మిగిలి ఉండేది కాదు." అన్నాడు ఆ వ్యక్తి.



ఇంగ్లండ్ రాజు షేర్‌వుడ్ ఫారెస్ట్ చేరుకుని చచ్చిన జింకవద్ద నిలుచుని వున్న లిటిల్ జాన్‌ని, జింకను దేనికి చంపావని అడుగుట

ఆ వ్యక్తి ఎవరో కాదు, లిటిల్ జాన్!....

"రాజుగారి సంపదను కాపాడుతాం అంటున్నావు. మరి ఈ జింకను

ఎవరు చంపారో తెలుసుకోవడం మీ బాధ్యత కాదా?" అన్నాడు ఇంగ్లండ్ రాజు.

"అది మా నాయకుడి బాధ్యత!.... మీరు నా వెంట వస్తే, మా నాయకుడి దగ్గరకు తీసుకు వెళతాను. మీరు అక్కడ అన్ని విషయాలు తెలుసుకోవచ్చును. విందు భోజనం చేయవచ్చును. విశ్రాంతి తీసుకున్న మీదట, మీ మార్గాన వెళ్ళ వచ్చును." అన్నాడు లిటిల్ జాన్.

సన్యాసి వేషంలో ఉన్న ఇంగ్లండ్ రాజు అందుకు అంగీకరించాడు. ఇద్దరూ కలిసి గ్రీన్‌ఉడ్ క్యాంప్ దగ్గరకు వచ్చారు.

అదే సమయంలో రాబిన్‌హుడ్ తన సహచరుల చేత గురి తప్పకుండా బాణాలు వేసి లక్ష్యాన్ని పడగొట్టే సాధన చేయిస్తున్నాడు.

రాబిన్ సన్యాసిని చూస్తూనే "రండి స్వామీ! మీకివే నా అభివందనాలు! వచ్చి యిలా కూర్చోండి!" అన్నాడు.

గురి చూసి లక్ష్యాన్ని చేధించడానికి సాధన చేస్తున్న ధనుర్ధారులను చూస్తూనే ఇంగ్లండ్ రాజుకు ఎంతో ఉత్సాహం ఉప్పొంగుతూ వచ్చింది.

"గురి చూసి బాణం వేయడానికి నాకు గూడ అనుమతి యిస్తారా?.... నేను మేటి విల్లుకాడనని నా స్నేహితులు అప్పుడప్పుడూ మెచ్చుకుంటూ ఉంటారు." అన్నాడు ఇంగ్లండ్ రాజు.

దానికి రాబిన్‌హుడ్ అంగీకరించాడు!....

ఇంగ్లడ్ రాజు వింటికి బాణం సంధించి, లక్ష్యాన్ని గురి చూస్తూ "మీ ముఠాలో ఒక మహావీరుడు యీ మధ్యనే వచ్చి కలిశాడని విన్నాను. అతడు యిక్కడే ఉన్నాడా?" అన్నాడు.

"ఆ మహావీరుడికీ, మా ముఠాకూ ఎటువంటి సంబంధమూ లేదు. అతడు అప్పుడప్పుడూ వచ్చి మమ్మల్ని పరామర్శ చేస్తూ ఉంటాడు. ఈ రోజు విలువిద్యా సాధన ఏర్పాటు చేసామనీ, దానిని పర్యవేక్షించేందుకు ఒకసారి రావలసిందిగా ఆ మహావీరుడికి ఆహ్వానం పంపించాము. అందువల్ల అతడు ఈ రోజు యిక్కడికి వచ్చాడు." అని జవాబు చెప్పాడు రాబిన్‌హుడ్.

"ఎవరా మహావీరుడు?"

"సర్ రిచర్డ్ ఆఫ్ లీ!.... అంతేకాదు మరొక వీరాధి వీరుడు కూడా ఈ రోజు యిక్కడికి రావలసి వుంది. అతని రాక కోసమే, మేమంతా ఎదురు చూస్తున్నాము." అన్నాడు రాబిన్.

"ఎవరా వీరాధి వీరుడు?"



తలమీద ధరించిన ముసుగు తీయమని, రాజుతో రాబిన్ చెబితే అందుకు అతడు నిరాకరించడంతో రాబిన్ ఇంగ్లండ్ రాజు ముఖంమీద బలంగా గుద్దుట!

"మా అందరికీ ప్రభువైన ఇంగ్లండ్ మహారాజుగారు" అన్నాడు రాబిన్‌హుడ్.

ఇంగ్లండ్‌రాజు తల తిప్పి అతడివంక చూస్తూ "అయితే రాబిన్‌హుడ్‌వి నువ్వేనన్నమాట!" అన్నాడు.

"అవును! నేనే!" అన్నాడు రాబిన్.

ఇంగ్లండ్‌రాజు లక్ష్యాన్ని గురిచూసిబాణం విడిచిపెట్టాడు. ఆ బాణం తిన్నగా వెళ్ళి లక్ష్యాన్ని తాకింది.

"భేష్! మీరు సన్యాసి అయి ఉండి కూడా బాణాన్ని యింత లాఘువంగా, లక్ష్యాన్ని కొట్టగలిగారంటే నేను అభినందించకుండా వుండలేక పోతున్నాను. మీరు మా ముఠాలో చేరితే నా తర్వాత స్థానం మీకేలభిస్తుంది." అన్నాడు రాబిన్‌హుడ్.

"అలాగే కానీయ్!" అన్నాడు ఇంగ్లండ్‌రాజు.

"మీ ముఖం మాకెవరికీ సరిగా కనిపించడంలేదు. నెత్తిమీద వున్న ఆ ముసుగును తీసివేయండి!" అన్నాడు రాబిన్.

నెత్తిమీది ముసుగును తొలగించడానికి ఇంగ్లండ్‌రాజు నిరాకరించాడు....

"నేను మీ అందరికీ నాయకుడను! నాయకుడి మాట తలదాల్చడం మీ అందరి కర్తవ్యం!....కనుక నెత్తిమీద వున్న ముసుగును తొలగించు!" అన్నాడు రాబిన్ కోపంగా.

అయినా సరే ఇంగ్లండ్‌రాజు ముసుగు తొలగించడానికి అంగీకరించలేదు.

రాబిన్‌కి నిజంగానే ఆగ్రహం వచ్చింది. వెంటనే పిడికిలిబిగించి ఇంగ్లండ్ రాజు ముఖం మీద బలంగా గుద్దాడు. ఆ దెబ్బకు ఇంగ్లండ్‌రాజు వెల్లకిలా నేలమీద పడ్డాడు.

దానితో ఆగ్రహం ముంచుకొచ్చిన, ఇంగ్లండ్‌రాజు తక్షణం పైకి లేచి రాబిన్‌హుడ్ ముఖం మీద చాచిపెట్టి ఒకటి వేసాడు. ఆ దెబ్బకు తట్టుకోలేని రాబిన్ దూరంగా వెళ్ళి నేలమీద పడ్డాడు.

ఇదంతా దూరంనుంచి చూస్తున్న సర్ రిచర్డ్ పరిగెత్తుకుంటూ వచ్చి రాబిన్‌ని చేయిపుచ్చుకుని పైకి లేపాడు. ఆ తర్వాత సన్యాసి వేషంలో వున్న ఇంగ్లండ్ రాజు ముఖంవంక పరీక్షగా చూసాడు. చూస్తూనే అతను ఇంగ్లండ్



మారువేషం తీసేసి ఇంగ్లండ్ మహారాజుగా వాళ్ళముందు ప్రత్యక్షమైన రాజు ముందు అందరూ మోకరిల్లుట!

మహారాజని గుర్తించాడు.

వెంటనే అతడి ముందు మోకరిల్లి శిరసువంచి నమస్కరిస్తూ "మహా ప్రభూ! మీరా!" అన్నాడు వినయంగా.

అప్పుడు గాని రాబిన్‌హుడ్‌కి ఆ సన్యాసి ఎవరో తెలిసిందికాదు.

అతడు ఇంగ్లండ్‌రాజు అని తెలియగానే రాబిన్‌హుడ్ మోకాళ్ళ మీద కూర్చుని శిరసువంచి ప్రభువుకు నమస్కరించాడు. అతడి సహచరులుకూడా నాయకుడ్ని అనుసరించారు.

ఇంగ్లండ్ రాజు సన్యాసి వేషాన్ని తీసేసి "అందరూ లేచి నిలబడండి!" అన్నాడు.

అందరూ లేచి నిలుచున్నారు.

"మేము ఇక్కడికి వచ్చి పరిస్థితులను క్షుణ్ణంగా పరిశీలించాము. మీరంతా పరిస్థితుల ప్రాబల్యంవల్ల యిలా దొంగలుగా మారి ఉంటారని మేము గ్రహించాము. మీరు దొంగలుగా మారినా ధనవంతులను దోచుకుని పేదలకు పెట్టారే తప్ప మీ స్వార్థం కోసం మాత్రం కాదని మేము తెలుసుకున్నాము. ఇకమీదట మీరు నేరస్థులుగా యీ అడవిలో బ్రతకవలసిన అవసరం లేదు. మీ అందరికీ క్షమాభిక్ష ప్రసాదిస్తున్నాము. ఈ క్షణం నుంచీ మీరు స్వేచ్ఛాజీవులు. మీరు మహావీరులు. మీకు సమ్మతమైతే మీరంతా మాతోబాటు ఇంగ్లండ్ వచ్చి, సైన్యంలో చేరవచ్చును. ఆ అవకాశాన్ని మీకు ప్రసాదిస్తున్నాను" అన్నాడు ఇంగ్లండ్ రాజు.

రాబిన్‌హుడ్ మౌనం వహించాడు. అతడి సహచరులంతా రాబిన్ ముఖం వంక చూడసాగేరు.

కొద్ది క్షణాలు గడిచిన తర్వాత ఇంగ్లండ్ రాజు నవ్వి "చూడు రాబిన్!.... ఇందులో బలవంతం ఏమీలేదు. ఇంగ్లండ్ రాజుగా మిమ్మల్ని ఆజ్ఞాపించడం నా అధి

మతం కాదు. నువ్వు చాలా సంవత్సరాలుగా ఈ షేర్‌వుడ్ ఫారెస్ట్‌లో స్వేచ్ఛా జీవితం గడుపుతున్నావు. రాచకొలువు అంటే బానిస బ్రతుకే!....నీకు యిష్టంలేని పని చేయమని నేను బలవంతం చేయను!....ఏదిఏమైనా మీరంతా స్వేచ్ఛాజీవులు.



ఇంగ్లండ్ రాజు రాబిన్‌నూ, అతడి అనుచరులనూ స్వేచ్ఛాజీవులుగా ప్రకటిస్తూ వాళ్ళమీద మోపబడిన నేరాలను రద్దు చేయుట.

ఇకమీదట మీరు ఎవరికీ భయపడవలసిన అవసరంలేదు. మీకు యిష్టమైతే, నగరాలలో జీవించవచ్చును. లేదా యీ అడవిలోనే కాలక్షేపం చేయవచ్చును" అన్నాడు.

"ప్రభువులవారి సహృదయాన్ని ఎంతగానో అభినందిస్తున్నాను. చిన్న తనం నుండీ నాకు అరణ్యమన్నా, అందులో నివసించే వన్యమృగాలన్నా ఎంతో యిష్టం. ఈ ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తూ జీవితాంతం యిక్కడే జీవితం గడపా లని ఉంది ప్రభూ! అయితే మేమంతా మీ దయవల్ల స్వేచ్ఛాజీవితాన్ని పొందాము కనుక, నా సహచరులు ఏ ప్రాంతానికైనా వెళ్ళి తమ జీవితాన్ని హాయిగా ప్రారం భించవచ్చును" అన్నాడు.

"మేము ఎక్కడికీ వెళ్ళం! మా నాయకుడు ఎక్కడ ఉంటే మేమూ అక్కడే ఉంటాం!" అన్నారు రాబిన్ సహచరులు ముక్తకంఠంతో.

"అయితే నాదొక మనవి! దానిని మీరంతా పాటించక తప్పదు" అన్నాడు ఇంగ్లండ్ రాజు.

"చెప్పండి ప్రభూ! మమ్మల్ని ఏం చేయమంటారు?" అని రాబిన్ అడి గాడు.

"నేను ముందు నడుస్తాను. మీరంతా, నాకు ఇరువేపులా వరుసగా నిలబడి అంగరక్షకుల మాదిరిగా, నన్ను నాటింగ్‌హామ్ పట్టణం వరకూ తీసుకువెళ్ళాలి" అన్నాడు ఇంగ్లండ్ రాజు.

తక్షణం రాబిన్‌హుడ్ సహచరులంతా ఇంగ్లండు రాజుకు ఇరువేపులా బారులుతీరి నిలుచున్నారు.

ఇంగ్లండ్ రాజు కాలినడకన షేర్‌వుడ్ ఫారెస్ట్ దాటి నాటింగ్‌హామ్ పట్ట ణానికి చేరుకున్నాడు. అది చూసిన నాటింగ్‌హామ్ పట్టణ వాసులంతా ఎంతో

ఆశ్చర్యపోయారు. 'అంతమంది రక్షకభటులు ఉండి కూడా షరీఫ్ సాధించలేని ఘన కార్యాన్ని ఇంగ్లండ్ మహారాజు సాధించగలిగాడు' అనుకున్నారు.

ఇంగ్లండ్ రాజు నాలుగు దారులు కలిసే విశాలమైన బహిరంగ ప్రదేశంలో నిలుచున్నాడు. అక్కడికి జనం విపరీతంగా రావడం ప్రారంభించారు. షరీఫ్ కూడా తన భటులతో అక్కడికి వచ్చాడు.

అప్పుడు ఇంగ్లండ్ రాజు ప్రజలనుద్దేశించి యిలా చెప్పాడు :

"మహాజనులారా! నేడు ఎంతో సుదినం. పేదలపాలిటి పెన్నిధి అయిన రాబిన్‌హుడ్‌కు మేము క్షమాభిక్ష ప్రసాదించాము. ఈ క్షణం నుంచీ అతడు కానీ, అతడి అనుచరులు కానీ, నేరస్థులు కారు. వాళ్ళంతా స్వేచ్ఛాజీవులు! ఈ నగర షరీఫ్ కానీ, మరొక అధికారి కానీ వీళ్ళను ఏమీ చేయడానికి వీల్లేదు. ఇది మా ఆజ్ఞ."

ప్రజలంతా ఇంగ్లండ్ రాజుకూ, రాబిన్‌హుడ్‌కూ జేజేలు పలికారు.

# ముగింపు

రాబిన్‌హుడ్ తన సహచరులతో షేర్‌వుడ్ ఫారెస్ట్‌లో స్వేచ్ఛగా హాయిగా ఎన్నో సంవత్సరాలు జీవించాడు.

అతడు మకుటం లేని మహారాజు. పేదలపాలిటి పెన్నిధి!.... పేదలను పీడించే ధనవంతులకు అతడు సింహ స్వప్నం!....

కాలం ఎల్లవేళలా ఒకే తీరుగా ఉండదు. రాబిన్ సహచరులంతా వృద్ధాప్యంలో అడుగుపెట్టారు. చివరకు ఒక్కొక్కరే తనువులు చాలిస్తూ వచ్చారు.

మృత్యువు ఎవరి మీదా దయ చూపించదు. చావుపుట్టుకలు ఏ ప్రాణికైనా సహజమే!—

రాబిన్‌హుడ్ కూడా జరా భారంతో కృంగిపోసాగేడు. ఇప్పుడు అతడిని కనిపెట్టుకుని ఉన్నది ఒక్క లిటిల్ జాన్ మాత్రమే.

"చూడు లిటిల్ జాన్! నేను ఎన్నో రోజులు బ్రతుకను. నేను చనిపోయిన తర్వాత, నా మృతదేహాన్ని ఈ షేర్‌వుడ్ ఫారెస్ట్‌లోని మన మిగతా స్నేహితుల

సమాధుల మధ్యగా సమాధి చేయించు!.... నేను నిన్ను కోరే చివరి కోరిక అదే!" అన్నాడు రాబిన్.

ఆ తర్వాత అతడు ఎన్నో రోజులు బ్రతకలేదు!.... మహా వీరుడుగా, సాహసకృత్యాల రాబిన్‌హుడ్‌గా ప్రజలచేత కీర్తింపబడిన రాబిన్, చివరకు మృత్యువుకు దొరికిపోయాడు.

ప్రపంచ ప్రఖ్యాతి పొందిన రాబిన్‌హుడ్ నిజంగా అమరజీవి అని చెప్పక తప్పదు!—

